


సచిత్ర మాస పత్రిక

7 A. శివాజీ స్ట్రీట్

టి. నగర్, మద్రాసు-17.

ఫోన్ : 442001

విడి ప్రతి వెల

ఒక రూపాయి

ఏడాది చందా

పన్నెండు రూపాయలు

సంపుటి 10

జనవరి 1972

సంచిక 1

సంస్థాపకులు :

కీ. శే. వి. ఎ. రాఘవయ్య

మేనేజింగ్ ఎడిటర్ :

శ్రీమతి వి. లీలావతి రాఘవయ్య

---

Edited & Published by
V. Leelavaty Raghavaiah, 7-A,
Sivaji Street, Madras-17 and Printed by B. V. Narasimha Rao, at
Sri Krishna Chitra Printers, 7,
[illegible] Rao Road, Madras-17


# విషయ సూచిక



ముఖ చిత్రం :
శ్రీ వెంకటేశ్వర ఆర్ట్సు ఫిలింస్
"మేరీ మాత"

# తొలిమాట

బాంగ్లా దేష్ అవతరించింది.

మన వీరజవానుల ధైర్య సాహసాలు మరో మారు ప్రపంచ రాజ్యాలన్నీ తెలుసుకోగలిగాయి బంగ్లాదేశ్ అవతరణతో. పాకిస్తాన్ క్రొత్త అధ్యక్షుడు భుట్టో ఎన్ని రేడియో ప్రసంగాలు చేసినా, ఎన్ని బహిరంగ సభలు జరిపినా - అతను కాంక్షించేది యుద్ధం-శాంతిమాత్రం కాదు. శాంతియుత ప్రవర్తన లేని ఏ వ్యక్తయినా, ఏ దేశమైనా పురోభివృద్ధిని ఆశించడం అసంభవం. భుట్టోకూడా యుద్ధానికి సంసిద్ధుడయితే, ప్రపంచ చరిత్రలో ఆయూబ్, యాహ్యాఖాన్‌లతో బాటు సైనిక నియంతగా పేరు సంపాదించుకోవడమే గాక భారత వీరజవానుల ధైర్య సాహసాలకు అవమానాల పాలై తీరటం నిజం!!!

ధైర్య సాహసాలతో పాకిస్తాన్ దురాక్రమణను ఎదుర్కొనిన భారత రత్న ఇందిరాగాంధీ ధైర్య సాహసాలను ఎలా మరువలేమో రష్యా తన మాట మీద నిలబడిన విషయం కూడా మరచిపోలేము.

*　　　*　　　*

శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి గారికి యింకా స్వస్థత చేకూరనందువ శల శిఖరాలు'' సీరియల్ ఈ నెల కూడా ప్రచురించక పోయాము. త్వరలో వారికి స్వస్థత చేకూరాలని, వారి రచన ''జ్యోతి'' లో ధారావాహికంగా ప్రచురితమవ్వాలనీ భగవంతుని మనసారా ప్రార్థిస్తున్నాం.

*　　　*　　　*

''జ్యోతి''ని దివ్య జోతిగా వెలిగించిన కీ॥ శే॥ వి. వి. రాఘవయ్యగారు 1971 ఫిబ్రవరి ఒకటవ తేదీని మరణించారు. ఈ సంవత్సర ఫిబ్రవరి సంచిక వారి స్మారక స్మృతులతో, ప్రముఖ రచయిత(త్రు)ల కథలు, సీరియల్స్, కొన్ని ప్రత్యేకాకర్షణలతో వెలువడుతుందని పాఠకులకు తెలియజేస్తున్నందుకు సంతోషిస్తున్నాము.

*　　　*　　　*

ఈ యుద్ధ సమయంలో తమ అమూల్యమయిన కాలాన్ని వృథా చేయడం సబబు కాదని శ్రీ శ్రీ గారు యీ మాసం కూడా వారి పనిలు విరమించుకున్నారు. అందులకు వారికి మనందరి ధన్యవాదాలు.

*　　　*　　　*

పాఠకులకు, రచయిత(త్రు)లకు, ఏజంట్లకు ప్రకటనదారులకు మా నూతన సంవత్సర శుభాకాంక్షలు.

# త్వరలో వస్తూంది!


నటసామ్రాట్ అక్కినేని నవ్యపోకడల్లో
నవరసభరితంగా నటించిన
శ్రీ విఠల్ ప్రొడక్షన్స్ వారి
బీదల పాట్లు
రచన డి.వి.నరసరాజు
ఫోటోగ్రఫీ ఎస్.వెంకటరత్నం
సంగీతం కె.వి.మహదేవన్
నిర్మాత-దర్శకుడు: బి.విఠలాచార్య
అన్నపూర్ణా రిలీజ్




ఎడిటర్ గార్కి,

డిసెంబరు జ్యోతిని అందుకున్నాము. "దీప శిఖ" కథ ఒక కొత్త పంథాలో నడిచింది,

"కోడలు-కోమలి" చాలా బాగుంది.

లీలావతి రాఘవయ్యగారి సంపాదకీయం దేశభక్తిని ప్రబోధించేదిగా ప్రకాశించింది.

శ్రీమతి యద్దనపూడి సులోచనా రాణీగారి "అగాధ శిఖరాలు" జనవరి సంచికలోనైనా వస్తుందని ఆశిస్తున్నాను. మాదిరెడ్డి సులోచనాగారి "శిక్ష" రానురాను ఉత్కంఠతను కలుగజేస్తోంది.

కార్టూనులు, జోకులు కడుపుబ్బ నవ్వించాయి. జనవరి జ్యోతికి హృదయపూర్వక స్వాగతం!

చా. సుబ్బారావు, తిరుపతి

డిశంబర్‌నెల "జ్యోతి" మాకు ఎంతగానో నచ్చింది. ఇందులో "మనసు జారితే" నాటకం చాలా బాగుంది. ముఖ్యంగా "శిక్ష" సీరియల్ మా హృదయాల నెంతో ఆకర్షించింది. రచయిత్రి గార్కి మా హృదయపూర్వకమైన ధన్యవాదాలు తెలుపగలరు. కుమారి వాణిశ్రీ గారి జవాబులు ఈ సంచికకే హైలైట్. ఇంకా "పచ్చిక" (పెద్దకథ) మాకు నచ్చిందని తెలుపుటకు ఆనందిస్తున్నాము.

యాలాల కాశీనాథ్, వై. సుజాత.
యాదగిరిగుట్ట.

డిసెంబర్ "జ్యోతి"లో కథ లన్నీ బాగున్నాయి. మాకు "జాజి మొక్క" అన్న కథ చాలా బాగా నచ్చింది. ఈ సంచికలో కూడా "అగాధ శిఖరాలు" సీరియల్ ప్రచురించబడలేదు. శ్రీమతి సులోచనా రాణిగారు త్వరలో ఆరోగ్యవంతులు కావాలని మేము హృదయపూర్వకంగా ఆశిస్తున్నాము. "కృష్ణవేణి" గారి "రాశిఫలాలు" యింటరెస్టింగ్‌గా వున్నాయి.

ఇందిరా. బేగం, అగిసేన్.
తిరుపతి.

డిశంబరు "జ్యోతి" ఎంతో సర్వాంగ సుందరంగా తయారైనదనటంలో సందేహం లేదు. దిన-దినాభివృద్ధి చెందుతున్న 'జ్యోతి'ని చూస్తుంటే 'జ్యోతి' కొరకు మీరెంత కృషి చేస్తున్నారో తెలియవస్తూంది. కాకపోతే 'అగాధ శిఖరాలు' సీరియల్ లేకపోవటం కొంత వెలితిగా వుంది. శ్రీమతి సులోచనారాణిగారు త్వరలో ఆరోగ్యవంతులై తిరిగి నవలను యధాతీతిని ప్రచురించాలని కోరుతున్నాం.

—సీత, మద్రాసు-4.




భారత పాకిస్తాన్ యుద్ధం రెండు వారాలలో ముగిసింది. పాకిస్తాన్ చివరికి కొరివితో తల గోక్కుంది.

ఈ యుద్ధం ఎలా వచ్చిందో, పాకిస్తాన్ తనకంటే అనేకరెట్లు అన్నివిధాలా పెద్ద దేశమైన భారతదేశంమీద యుద్ధం ప్రారంభించడానికి కారణమేమిటో మీకు తెలుసు. పాకిస్తాన్ ఏర్పడినప్పటినుంచీ యిప్పటివరకూ దాని పాలకులు తమ ప్రజలను మతమౌఢ్యంతో, అజ్ఞానంలో, దారిద్ర్యంలో వుంచి భారతదేశంపట్ల శతృత్వమనే విధానంమీద బతుక్కొస్తున్నారు. పైగా తమదేశీయులైన తూర్పు బెంగాల్ ప్రజలను దోచుకొని, వారిని బానిసలుగా చేశారు. తూర్పు బెంగాల్ ప్రజలు తిరగబడడంతో పాక్ సైనిక నియంతలు లక్షలాది ప్రజలను చిత్రవధ చేశారు. కోటిమంది భారతదేశానికి కాందిశీకులుగా వచ్చారు. అయితే పాకిస్తాన్ పాలకులు దీనంతటికీ భారతదేశాన్ని నిందించారు. భారతదేశంపట్ల పాకిస్తాన్ శతృత్వాన్ని తమ ప్రపంచ రాజకీయ వ్యూహంలో పాచికగా ఉపయోగించుకునేందుకు అమెరికా, చైనాలు పాకిస్తాన్‌కు బాగా సైనిక సహాయం చేసి దానిని యుద్ధానికి పురిగొల్పాయి. గత ఇరవై సంవత్సరాలుగా పాకిస్తాన్ తన దేశాదాయంలో నూటికి ఎనభై వంతులు రక్షణ అవసరాలకై ఖర్చు చేసింది. ఎన్నో ఆయుధాలు సమకూర్చుకుంది. వాటిని ఉపయోగించాలికదా మరి. ఇన్ని ఆయుధాలు వున్నాయి గెలవలేమా అనుకుంది. కాని యుద్ధంచేసేవి ఆయుధాలు మాత్రమే కావనీ, మనుషులనీ మరిచిపోయారు పాక్ సైనిక ప్రవీణులు.

రెండు వారాలలో పాకిస్తాన్ అపారంగా సైనిక సామగ్రినీ, సైనికుల్నీ పోగొట్టుకుంది. తూర్పు పాకిస్తాన్‌లో పాక్ సైన్యం లొంగిపోయింది. పశ్చిమ రంగంలో అనేక సైనిక స్థావరాలను కొంత భూగాన్ని పోగొట్టుకుంది. భారతదేశం యుద్ధవిరమణ ప్రకటించగానే పాకిస్తాన్ "బ్రతుకు జీవుడా" అంటూ చావు తప్పి కన్ను లొట్టపోయి బయటపడింది.

అయితే, ఈ యుద్ధంవల్ల కలిగిన ఫలితాలలో, పాకిస్తాన్ రెండు ముక్కలై బంగ్లాదేశ్ ఆవతరించడం చాల ముఖ్యమైనది. భారతదేశంయొక్క రాజకీయ, నైతిక, సైనిక పాటవం ప్రపంచానికి వెల్లడయింది. భారతదేశపు ప్రతిష్ట హిమాలయమంత ఎత్తు పెరిగింది. అందుకనే

ఈ యుద్ధంలో పాకిస్తాన్ కొమ్ముకాసిన వారు కన్నంలో తేలుకుట్టిన దొంగల్లా నోరు మెదపలేక పోతున్నారు. మళ్ళీ పాకిస్తాన్ భారతదేశంమీద దాడి చేసిన ట్లయితే అది సర్వనాశనం కాకుండా దాని మిత్రు లెవ్వరూ రక్షించలేరన్న విషయం ఇప్పటికే లోకానికి అర్థమయ్యేవుండాలి.

ఈ యుద్ధం భారతదేశానికి కొన్ని గుణపాఠాలు నేర్పింది. వీటిలో మనం స్వశక్తిమీద నిలబడాలన్నది ముఖ్యమైనది. అతి చిన్నదేశమైన వియత్‌నామ్ లాటిది స్వశక్తి మీద నిలబడడంవల్ల అమెరికాలాంటి దేశం పదేళ్ళుగా దాని నేమీ చేయలేకపోతుంది. అలాంటిది ఏభై అయిదు కోట్ల జనాభా కలిగిన మనదేశం ఏ ఒక్కరిమీదా ఆధారపడ నక్కరలేదు అవసరమైనంత మేరకు మిత్రదేశాల నుండి సహాయం యిచ్చి పుచ్చుకోవచ్చును కాని. వాటిమీద ఆధారపడి మనం బ్రతక కూడదు. పాకిస్తాన్ అలా ఆధారపడి నిప్పులో దూకింది. దానిని నిప్పులోంచి బయటికి తియ్యడానికి దానిమిత్రులెవ్వరూ చేతులు కాల్చుకోదలచుకో లేదన్నది స్పష్టమైంది?

మనదేశం మరొక గుణపాఠం కూడా నేర్చుకుంది. ఆపత్సమయంలో ఏ దేశాలు మనకి అండగా నిలిచాయి. ఏవి ఎదురు తిరిగేయి అనే విషయ మొకటి స్పష్టమయింది. ఇందువల్ల ముమ్ముందు భారత దేశపు విదేశాంగ రాజనీతిలో కొంత మార్పు రావచ్చునని భావించవచ్చును.

ఈ సమయంలో మనకు అండగా నిలబడినవి రష్యా, పోలెండ్ దేశాలు. రష్యా భారతదేశపు దృక్పథాన్ని పూర్తిగా అర్థంచేసు కుంది. భారత పాకిస్తాన్ యుద్ధానికి మూలకారణం తూర్పుబెంగాల్ సమస్య అనీ దానిని పరిష్కరించనిదే ఏ సమస్యా పరిష్కారం కాదనీ భారత దేశంలో స్పష్టంచేసింది. అమెరికా వారి తీర్మానాన్ని భద్రతాసమితిలో మూడుసార్లు వీటోచేసింది. బయటివా రెవ్వరూ ఈ యుద్ధంలో జోక్యం చేసుకోరాదని హెచ్చరించింది. ఈ హెచ్చరిక అమెరికా, చైనాలకే నన్నది అందరికీ తెలుసు. ఈ ఆపత్సమయంలో రష్యా భారత దేశానికి నిజమైన మిత్ర దేశంగా రుజువైంది. దీనితో భారత-సోవియెట్ మైత్రి మరింత పటుతరమైంది.

ఈ యుద్ధంలో అమెరికా తన నిజ స్వరూపాన్ని బయటపెట్టుకుంది. అది మొదటినుంచీ పాకిస్తాన్ సైనిక నియంతృత్వాన్ని బలపరుస్తూనే వచ్చింది. పాక్ సైనికాధికారులు తూర్పు బెంగాల్‌లో లక్షలమంది ప్రజల్ని హత్యచేస్తే, కోటి మంది ప్రజలు దేశం వదలిపోయే పరిస్థితులు కల్పిస్తే అమెరికా యాదేమీ జరుగ నట్టుగానే కళ్లు మూసుకుని పాకిస్తాన్ పాలకులను ప్రోత్సహించింది, చివ

వరకు అసంఖ్యాకంగా ఆయుధాలిచ్చింది. ఐక్యరాజ్య సమితిలో పాకిస్తాన్‌కు అను కూలంగా తీర్మానం పెట్టి నూట నాలుగు ఓట్లతో అది నెగ్గేటట్లు చేసింది. భారత దేశమే యుద్ధం ప్రారంభించిందనీ నిందిం చింది భారతదేశానికి ఆర్థిక సహాయం నిలిపివేసింది, చివరికి సప్తమ నౌకాదళాన్ని బంగాళాఖాతానికి తీసుకువచ్చి బెదిరించింది.

హార్వర్డువిశ్వవిద్యాలయ ఆచార్యుడూ, ప్రసిద్ధ పండితుడూ, భారతదేశానికి మాజీ అమెరికన్ రాయబారీ అయిన జాన్ కెన్నెత్ గాల్బ్రెత్ అమెరికన్ ప్రభుత్వ వైఖరిని చెబుతూ ఇలా అన్నారు: "భారతదేశాన్ని దురాక్రమణదారని నిందించడం అమెరికన్ ప్రభుత్వాన్ని అవమానించడమే అవుతుంది. మనం చేస్తున్నపని చాల అవినీతికర మైనది" అమెరికాలోని పత్రికలూ; శాసనసభ్యులూ తమ ప్రభుత్వ వైఖరిని ఇలాగే తీవ్రంగా ఖండించడం జరిగింది. అయినా అమెరికన్ ప్రభుత్వం పాకిస్తాన్‌ను ఎలా వదులుకో గలదు, అమెరికా తన మిత్రుడైన యాహ్యాఖాన్‌ను కాపాడాలని చివరివరకూ ప్రయత్నించింది, విఫలమై, మరింత అప్రతిష్ట పాలైంది.

భారతదేశాన్ని నిందించి, పాకిస్తాన్‌ను బలపరచడంలో చైనా అమెరికాతో చేతులు కలిపింది. పీడిత ప్రజల విప్లవాలనూ, జాతీయ విముక్తి ఉద్యమాలను బలపరుస్తున్నామని గావుకేకలేసే చైనా నాయకులు పాకిస్తాన్ సైనిక నియంతృత్వాన్ని బలపరచి, బంగ్లాదేశ్ ప్రజలను వెన్నుపోటు పొడిచారు, 1962 నుండి చైనా పాకిస్తాన్‌కు సైనిక సహాయం చేస్తూనేవుంది. యుద్ధానికి ముందు నవంబరులో 400 యుద్ధ విమానాలు, ఆయుధాలు యిచ్చింది. 200 మంది సైనిక నిపుణులను పంపింది. ఢాకావద్ద మందుగుండు ఫ్యాక్టరీ నిర్మాణానికి తోడ్పడింది, పాకిస్తాన్‌ను యుద్ధానికి పురికొల్పింది.

ఐక్యరాజ్య సమితిలోనూ, భద్రతా సమితిలోనూ చైనా పాకిస్తాన్‌ను గట్టిగా బలపరచి భారతదేశాన్నీ, రష్యాదేశాన్నీ నిందించింది. చైనా నాయకులు రష్యా, భారతదేశాలపట్ల గుడ్డిద్వేషంతో ప్రవర్తిస్తూ తన విప్లవ తత్వానికి తిలోదకాలొదిలారు,

అయినప్పటికీ భారతదేశం తన లక్ష్యాన్ని సాధించుకుంది. భారతసైనికులు, ముక్తివాహినీ వీరులతో కలిసి బంగ్లాదేశ్‌ను విముక్తిచేశారు, ప్రజాస్వామ్యం, మతప్రసక్తి లేని విధానం, సామ్యవాదం- వీటిని ధ్యేయంగా పెట్టుకున్న ప్రజాతంత్ర బంగ్లాదేశ్‌రాజ్యం అవతరించింది. ఈ నిజాన్ని చూడలేనివారు కళ్ళు మూసుకోవచ్చును కాని, అంతమాత్రాన బంగ్లాదేశ్‌కు నష్టమేమీ లేదు. భారత బంగ్లాదేశ్ రాజ్యాలు దృఢమైత్రి పరస్పర సహకారాలతో పురోగమించడం తథ్యం.

—కృష్ణవేణి

# కోడలు కోమలి

కొసరాజు సుబ్బాన్న



(గత సంచిక తరువాయి)

ఎప్పుడూ యింటి పనులు చేయని కోమలిని ఇరుగు పొరుగు వాళ్ళు యిప్పుడు చూసి నమ్మలేక పోయారు ఆమె కోమలి అని. కానీ ప్రతి ఒక్కరి పలుకరింపుకు కోమలి సమాధానంగా నిండైన చిరునవ్వు ఆమె పెదాలపై మెదులుతూంది.

కోమలి సంసారానికి వచ్చిన తరువాత ఇరుగు పొరుగు వాళ్ళతో కూడా నిండుగా పలుకరించటం సుశీలమ్మ యిదే మొదటి

సారిగా చూడటం మరింత ఆనందం పొందిందామె.

"అత్తయ్యా!....పాలు మాడుతున్నాయి." వీధిలో నుంచే కేక పెట్టింది కోమలి

ఆమె అరుపుకు సుశీలమ్మ తేరుకుంది. తన పరిస్థితికి నవ్వుకుంటూ వంట గది వైపుకు నడిచింది. కానీ ఆమె కంటే వేగంగా వచ్చి, పాలగిన్నెను పొయ్యిమీద నుంచి దించేసింది.

"బావి దగ్గర నుంచి రెండు చేద అందుకొని వస్తానుండత్తయ్యా!" అంటూ చివ్వున లేచి రివ్వున వెళ్ళిపోయింది ఎదురు వస్తున్న సుదర్శనాన్ని చూసి ప్రక్కకు తప్పుకుంటూ కోమలి.

వంట గదిలోకి వచ్చిన కొడుకును చూసి నిండుగా నవ్వింది సుశీలమ్మ. కాఫీ కలిపిస్తూ అంది: "ఇప్పుడు నా మనసు కెంతో ప్రశాంతంగా వుంది."

తల్లి ఎంత కాలానికి సంతోషంతో మాట్లాడగలుగుతూందో వూహించుకున్నాడు సుదర్శనం. ఆ విషయాన్ని గురించి మాట్లాడదలచుకో లేదతను. కారణం రాత్రి తను వూహించుకున్నాడు పూర్తిగా మారిపోయిందని.

"మీ నాన్న వూరి నుంచి వచ్చేంత వరకూ యిలాగే మారిపోకుండా వుంటుందంటావా?"

ఇంత కాలానికి కోడలిలో మార్పు రావటం ఆమె భర్త కళ్ళారా చూడాలని ఆమె ఆకాంక్ష!

సుదర్శనం సమాధానంగా కాఫీ ముగించి నవ్వుతూ వెళ్ళిపోయాడు.

అంతలోనే 'సుశీలక్కయ్యా' అంటూ వచ్చింది దుర్గమ్మ.

సుశీలమ్మ ఆమెను చిరునవ్వుతో ఆహ్వానించింది. ఆమె సంతోషాన్ని దుర్గమ్మ దాటలేనంత కళ్ళతో గ్రహించింది. అర్థం చేసుకున్నట్లు ప్రతిగా చిరునవ్వు నవ్వింది.

"కోమలి ఏదీ?" మామూలుగా అడిగింది దుర్గమ్మ.

"బావి దగ్గరుంది. రా....కూర్చో.... కాఫీ త్రాగుతావా?" అడిగింది సుశీలమ్మ వేడి పాలు చల్లార్చుతూ.

"ఇప్పుడు కాఫీ త్రాగుతూ కూర్చుంటే ప్రయోజనం లేదు. మీ మరిది తోనుకు వెళ్ళాలి. ఒక్కసారి కోమలిని చూసి వెళదామని వచ్చాను. ఇప్పుడే వస్తానుండక్కయ్యా...." అంటూ పెరట్లోకి నడిచింది దుర్గమ్మ.

ఆమె వెళుతున్న వైపు కృతజ్ఞతా పూర్వకంగా చూసింది సుశీలమ్మ. కారణం కోమలిలో యింత మార్పుకు దుర్గమ్మ మాటల తీరు అనుకుంది

రోజూ ఉదయాన గ్లాసెడు పాలు త్రాగే

అలవాటుంది సుశీలమ్మకు. పాల గిన్నె లోంచి గ్లాసులోకి వంచింది పాలను. గ్లాసు తీసుకొని వంట గదిలోంచి యివతలకు వస్తుండగా బయటి అరుగుమీద కూర్చుని చదువుకుంటూన్న చిన్నకొడుకు 'అమ్మా! నాకూ పాలు...." అంటూ వచ్చాడు.

"ఒరేయ్ బాబూ.... ఈ రోజు మొదలు యింట్లో నన్నేమీ అడగకు. అంతా మీ వదిన యిష్టమే!" సంతోషంగా అని పూజ గదిలోకి వెళ్ళిందామె.

మనస్తత్వాలు అర్థం చేసుకోలేని వయస్సు కాబట్టి కుర్రాడిది కొంచం అసహనంగా ముఖం చిట్లించుకున్నాడు. వదిన కోసం పెరటివైపు పోబోయాడు. అంతలోనే కోమలితో దుర్గమ్మ ఏదో గుసగుసలాడుతూ రావటం జరిగింది. కుర్రాడిని చూసి సంభాషణ ఆగిపోయింది.

కుర్రాడు గ్రహించే స్థితిలో లేదు. "వదినా పాలు...." అన్నాడు.

'నే వెళ్ళొస్తానమ్మా! బాబుకు ఏం కావాల్లో చూడు...." అంటూ వెళ్ళిపోయింది దుర్గమ్మ.

వదినతో కోమలి వంట గదివైపుకు నడిచింది.

ఒక్కసారి పాలు గ్లాసు నిండుగా పోసి మరిదికిచ్చింది. కుర్రాడు సంతోషంగా పాలు అందుకొని తాగేడు. మళ్ళీ మరలా చదువులో మునిగిపోయేడు కుర్రాడు. కోమలి మరో గ్లాసులో పాలు నిండుగా పోసింది. గ్లాసుతో వంట గదిలోంచి యివతలకు వచ్చింది. పరిసరాలన్నీ నిర్మానుష్యంగా వున్నట్లు తోచాయి

"అత్తయ్యా!" మెల్లిగా పిలిచింది కోమలి.

"ఇదో వస్తున్నానమ్మా...." అంటూ పూజ గదిలోంచి వచ్చింది చేతిలో పాల గ్లాసుతో సుశీలమ్మ.

"పాలు తీసుకోండి...." అంది కోమలి

"తాగుతున్నాను. ఇంకెందుకు నాకు? నువ్వు తాగెసెయ్...." ఆప్యాయంగా అంది సుశీలమ్మ.

"ఇంకొంచం తీసుకోండి." అంటూ బలవంతంగానే ఖాళీ అవుతున్న గ్లాసుని పూర్తిగా నింపింది కోమలి.

కోడలి ఆప్యాయతకు నిండుగా నవ్వుతూ చూసింది సుశీలమ్మ. సిగ్గు నటిస్తూ వంట గదిలోకి వెళ్ళిపోయింది.

కానీ అంతలోనే ఏదో జ్ఞప్తి వచ్చిన దానిలా "అత్తయ్యా! వీధి గుమ్మంలో ముగ్గు వేయటం మరచి పోయాను" అంటూ నసిగింది కోమలి

"ఇదో వేసి వస్తాను ..." అంటూ పాల గ్లాసు ప్రక్కనే వున్న కిటికీలో వుంచి, ముగ్గు డబ్బాతో బయటకు నడిచింది.

ఉన్నట్టుండి కోమలి గుండెలు అదు



రుతో కొట్టుకోసాగాయి. ఆమె కళ్ళు ఆశ్చర్యతతో కూడుకున్న భయంతో పరిసరాలు పరికించాయి. అంతా నిర్మానుష్యం. ఒక్క గంతులో పెరట్లోకి నడిచింది. కోళ్ళ గూడు ప్రక్కనున్న చిన్న సీసా అందుకుంది. అంతకంటే వేగంగా తిరిగి యథాస్థానానికి వచ్చింది. సుశీలమ్మ నింపాదిగా ముగ్గు పెడుతూంది. వణుకుతున్న చేతులతో సీసాలోంచి రెండు బొట్లు పాల గ్లాసులోకి వంచింది. ఒక్క క్షణం అక్కడ నిలుచోలేక పోయింది. రివ్వున కోళ్ళ గూడు దగ్గరకు వెళ్ళింది సీసాను అక్కడ దాచబోయింది. కానీ అది క్రింద పడిపోయింది. నేలపాలైన దాన్ని గూర్చి ఆలోచించటం అనవసరం. వేగంగానే వెనుదిరిగింది. గుమ్మం దగ్గరకు చేరేసరికి ఏదో శబ్దమై అటుగా చూసింది. బలమైన కోడిపుంజు గిలగిల తన్నుకుంటూంది.... ప్రాణాలు కోల్పోయేందుకు మరో కోడి ఆ ప్రాంతానికి చేరుకుంటూంది. తృప్తిగా నవ్వుకుంటూ లోనికి వచ్చేసింది కోమలి.

ముగ్గు వేయటం పూర్తి చేసి అప్పుడే లోనికి వస్తుంది సుశీలమ్మ. ఆమె చూడకుండా వంట గదిలోకి వెళ్ళింది కోమలి. తలుపు వెనుకనుంచి పరికించ సాగింది. చేతిలో వున్న ముగ్గు డబ్బాను పెట్టో కిటికీలో వుంచి చేతులు శుభ్రంగా కడుక్కొచ్చింది సుశీలమ్మ పాలగ్లాసు దగ్గరకు.

సుశీలమ్మ పాలగ్లాసు అందుకుంది. కోమలిలో ఆతృత ఎక్కువైంది. ఆతృతతో బాటు సంతోషం కూడా మొలకెత్తుతూంది. యథాలాపంగా రెండు గుటకలు వేసింది. కోమలి తృప్తిగా నిట్టూర్చింది.

కానీ అంతలోనే సుశీలమ్మ ఏదో

అనుమానం వచ్చినట్లు గ్లాసును పరికించ సాగింది. నాలికను పైట కొంగుతో తుడుచుకోవటం మొదలు పెట్టింది.

''అమ్మాయ్.... అమ్మాయ్....'' కేక వేసింది సుశీలమ్మ.

కోమలి సమాధానం యివ్వలేదు.... ఉన్నట్లుండి ధైర్యాన్ని కూడగట్టుకుంది.

"బాబూ.... బాబూ...." కేక వేసింది కోమలి నుంచి సమాధానం రాకపోవటంతో సుశీలమ్మ.

విసుక్కుంటూ వచ్చాడు కుర్రాడు చదువు పాడయిందని.

''ఈపాలు ఒక్కసారి త్రాగి చూడరా బాబూ! నాకేమీ వాసన తెలియటం లేదు. నాలికంతా పీకేస్తుంది....'' అంటూ అందించింది సుశీలమ్మ.

''కిరసనాయిలా!!'' అర్థం కాలేదు సుశీలమ్మకు.

''వదినకు మామూలేగా.... మంచిగా వున్నట్లే వుండి నిన్ను ఏడిపించడం! వదినే కిరసనాయిలు కలిపి వుంటుంది పాలలో." పెద్ద తెలివి వున్న వాడిలా అనేశాడు కుర్రాడు

సుశీలమ్మకు అంతా అయోమయంగా వుంది. ఒక ప్రక్క నుంచి నాలుక పిడచ గట్టుకు పోతూంది. ''అమ్మాయ్... అమ్మాయ్..'' అని అతి శ్రమ మీద పిలిచింది.

కోమలి మాత్రం రానున్న అపాయాన్ని అతి జాగ్రత్తగా తప్పించుకునేందుకు అతి తీవ్రంగా ఆలోచిస్తూంది.

కోమలి నుంచి సమాధానం రాకపోవటంతో "దుర్గమ్మా.... దుర్గమ్మా...." అంటూ గ్లాసుతో వీధి వైపుకు వడిచింది. కుర్రాడు కూడా ఆమెను అనుసరించాడు.

దుర్గమ్మ యింట్లో లేదు. ఆమె కూడా భర్తతో బాటు టవున్‌కు వెళ్ళిందని తెలిసింది

సుశీలమ్మ మనసంతా అల్లకల్లోలంగా వుంది. ఎంతో వినయంగా నటిస్తూ తిరిగి తనను అవమానం చేసింది కోడలు.

రచ్చబండ మీద కూర్చొని వున్న ఓ పెద్దమనిషి సుశీలమ్మ ఆత్రుతకు గ్లాసును అందుకోకుండా వుండలేక పోయాడు. పాలను వాసన చూపి ''సుశీలక్కా! ఇది కిరసనాయిలు కాదు ఎండ్రిన్'' అన్నారు.

అంతే! అంతవరకు ధైర్యంగా వున్న సుశీలమ్మ ''ఎండ్రినా?'' అంటూనే ఒక్కసారిగా నేలకొరిగి పోయింది.

అప్పుడే అక్కడికి వచ్చిన సుదర్శనం ఒక్క పరుగున యింట్లోకి పరుగు తీశాడు. ఇల్లంతా శూన్యంగా వుంది. కోమలి లేదు!

కోమలి తను తీర్చుకోవలసిన పగ తీర్చుకుంది. అమాయకురాలైన సుశీలమ్మ నిండు ప్రాణాలను బలి తీసుకుంది. పగ—మనుష్యులను ఎంత నీచానికైనా దారి తీయిస్తుంది. కోర్టుకెక్కితే గాని శిక్షింపబడరు దుర్మార్గులు. కానీ మానసిక వ్యధతో కొంతమంది దుర్మార్గులు జీవితాంతం బాధపడి కృంగి కృశించిపోతారు. కానీ అమాయకుల ప్రాణాలు అర్ధాంతరంలోనే అంతరించి పోతాయి. అయితే ఈ ఘోరానికి సరైన శిక్ష ఎక్కడ? దేవుడనే వాడుంటే దైవం ఎదుటనే!

మీ ప్రశ్నలకు

# కుమారి వాణిశ్రీ

జవాబులు



జె. వి. రామారావు, విశాఖపట్టణం

ప్ర: వాణిశ్రీగారూ! నేటి సినిమాలు వాటి ప్రాముఖ్యత యీ నాటి సమాజానికి ఎంతవరకూ (దగ్గరగా) ఉపయోగపడు తున్నాయి?

జ: ఎంతవరకు ఉపయోగపడుతున్నవో నాకు వివరంగా తెలియదు. కానీ, ఉపయోగపడితే బాగుంటుందని గాఢంగా నమ్ముతున్నాను.

బి. మురళి, గంగ్రాడాయి

ప్ర: భారత దేశంలో పేదరికం ఎప్పుడు పోతుంది?

జ: దేశ కళ్యాణానికి అందరూ వళ్ళు వంచి పాటుపడినపుడు.

చాగంటి సుబ్బారావు, హెచ్. వి. చలపతి, తిరుపతి

ప్ర: "ఓల్డు ఈజ్ గోల్డు" అని విదేశీయులు అంటే "కొత్త ఒక వింత, పాత ఒక రోత" అని మనవాళ్ళు అన్నారు. దీనిపై మీ అభిప్రాయం ఏమిటి? మీరు ఏ ప్రవచనాన్ని ఆచరిస్తారు?

జ: పాత కొత్తల మేలికలయికని గురుజాడవారి అభిప్రాయమే నా అభిప్రాయం. ఇది అందరి అభిప్రాయం కావాలని నా ఆకాంక్ష.

వి. శేఖర్, యాడికి

ప్ర: అక్కయ్యా! మీకు అమావాస్యంటే భయంలేదని విన్నాను నిజమేనా?

జ: అప్పుడే పౌర్ణమియొక్క గొప్పతనం తెలుస్తుంది.

కె. ప్రభాకర్, దార్ల

ప్ర: ఏదో చెప్పాలని, ఏదీ చెప్పలేని పరిస్థితి. ఏదో చేయాలని, ఏదీ చేయలేని పరిస్థితి. ప్రతి మనిషికీ జీవితంలో ఒక్కోసారి సంభవిస్తుంది. ఎప్పుడు? ఎందుకు?

జ: చెప్పడం, చేయడం మనసుమీద ఆధారపడివుంటాయ్. మనసు విభ్రాంతి పడినప్పుడు ఏదీ చెప్పలేం.- ఏమీ చేయలేం!

ఆర్. రాజారావురెడ్డి, నాపడ

ప్ర: వాణిశ్రీగారూ! స్త్రీకి సహజ సౌందర్యమేది?

జ: సిగ్గూ, సింగారం అన్నారు పెద్దలు.

ఇ. ఎస్. ప్రభాకర్, పాకాల

ప్ర: అక్కయ్యగారూ! మీరు ఇంత బాగా నటించి పేరు సంపాదించుటకు కేవలం మీ అదృష్టమా? లేక మీ కృషి ఫలితమా?

జ: రెండూనూ.

మాడిశెట్టి రాజేశం, సిరిమాబాద్

ప్ర: వాణిశ్రీ అక్కగారూ! ఒక స్త్రీ సంసారికంగా సుఖపడలేక, భర్తను సుఖపెట్టలేక, మరియొకరికి మనసివ్వలేక సుఖపడాలని ఆశించుతారు. ఎలా? మీ అభిప్రాయ మేమిటి?

జ: ఒకరిని సుఖపెట్టడం చేతకానప్పుడు తాను సుఖపడాలనుకోవడంలో అర్థంలేదు.

C. Krishnabai, Rayadurg

Q: I Think action is nearer to reality but not real: Who is your favourite God?

A. Because it is an ACTION: LORD VENKATESWARA.

ఎమ్. ఆదినారాయణ, శ్రీకాకుళం

ప్ర: సోదరి! ప్రేమించిన వ్యక్తిని మరచిపోలేక అతని ఫోటోను ఆరాధించింది ఒకామె. అది తప్పా? అవినీతా?

జ: కాదు. నీతే!

పంపన దయానందబాబు, కలకత

ప్ర: సినీ యాక్టర్స్ అందర్నీ దేవుళ్ళకంటే ఎక్కువగా పూజించుచున్నారు. కారణం ఏమిటంటారు? వివరించి చెబుతారా?

జ: కనిపించని దేవుని వేషాల్ని ధరించి కనబడుతున్నారు కాబట్టి.

యు. ఎస్. రావు, కలకత్తా

ప్ర: వాణిశ్రీగారూ! మీరు బంగ్లాదేశ్ ప్రజలకు ఏమైనా విరాళం యిచ్చారా?

జ: ఇచ్చాను.




యం. శంకర రెడ్డి, బెల్లంపల్లి

ప్ర: ఏమండీ! దారివెంట పోతున్న స్త్రీని అక్కా అనిగానీ, సోదరీ అని గాని పిలిచి మాటలాడితే ఎంతో ఆప్యాయతగా మాటలాడుతారు. అలా కాక వూరికే పిలిసే కాలికున్న చెప్పుతీస్తారు....

జ: అంతేనండీ .... నోరు మంచిదైతే వూరు మంచిదౌతుం దంటారు.

ఎస్. విజయకుమార్, హైదరాబాదు

ప్ర: ప్రియమైన వాణిశ్రీ గారూ! ప్రేమనగర్ లోని "కడవెత్తుకొచ్చింది,.." అను పాట ఏ ఊరిలో ఎప్పుడు చిత్రీకరించ బడినది?

జ: ఊటీలో.

పెసరమల్లి కమల, బి. ఎ. గుంటూరు

ప్ర: వాణిశ్రీగారు! సినీమారంగంలో ప్రవేశించాలనుకొనే వారికి మీ అనుభవంతో కూడిన సలహా ఏమిటి? నటీమణులకు తమతోటి నటీమణులపై ఎలాటి భావం వుంటుంది?

జ: దిగితేగాని లోతు తెలియదు. స్నేహ భావం.

మాదిరెడ్డి సులోచన



(గత సంచిక తరువాయి)

నా జీవితం యెత్తి చూపి లొంగదీయాలని చూస్తున్నారా? తీక్షణంగా అడిగాను.

"ఊఁ పిచ్చివాడివి. అలా చెయ్యదలిస్తే యింతసేపు నీతో వాదన దేనికి? సుధీర్! మంచికో చెడుకో నిన్ను చూడగానే ఓ విధమైన వాత్సల్యము కల్గింది. ఈ నాడు నువ్వు నా పంచ చేటకపోయినా నిన్ను నేను ఏమీ అనను. కాని ప్రపంచాన్ని అర్థంచేసుకో. మోసమూ, అన్యాయము మనం పెద్ద మనుష్యులుగా వ్యవహరించే సాధనాలు. అవి లేవినాడు మనకూ వెర్రివారికి తేడాయే వుండదు లోకం దృష్టిలో. ఆలోచించు. నీకు అంగీకారమైతే రేపురా. లేకుంటే నువ్వు యిక రావద్దు. నా గురించి భయంఅక్కరలేదు. సినిమాలో విలన్‌లాగ నిన్ను బ్లాక్ మెయిల్ చెయ్యను. హాని అంతకన్నా చెయ్యను" అతను తనగదిలోకి వెళ్ళిపోయాడు.

నా జీవితంలో అడుగడుగునా తల యెత్తే సమస్యల నెలా పరిష్కరించు కోవాలో తెలియదు. ఆ రాత్రంతా పిచ్చి వాడివలె హుస్సేన్ సాగర్‌లోకి చూస్తూ టాంక్‌బండ్‌పైన గడిపానంటే యెవరూ నమ్మరు. అతను చెప్పింది నిజమే కదా. అవసరానికి అతను ఆదుకోనియెడల నా జీవితం యెలా వుండేదో! నిజాయితీ యెక్కడ ఉంది! ఆలోచించి బుర్ర పాడు చేసుకుని చివరకు అతనికి సహాయ పడు టకే నిశ్చయించుకున్నాను.''

''యెంత పని చేశారు?'' ఆశ్చర్యంగా భార్యవంక చూచాడు. ఆమె తను చేసిన దాన్ని అంగీకరిస్తుందనుకున్నాడు.

''చూడండి. ప్రక్కవాడు తప్పు చేస్తు న్నాడని మనంచేస్తామా? యెందరో మోస గాళ్ళుండవచ్చు. కొందరయినా మంచి వాళ్ళు లేరా? ధర్మం నాల్గుపాదాల నడవక పోయినా కుంటిగా నడుస్తుంది. యెవరో చేశారని మనము ఊబిలోకి దిగడం ఏమీ బాగాలేదు'' అన్నది.

''మంచో, చెడో ఆ క్షణంలో అంత కంటే మార్గం కనిపించలేదు. వెళ్ళి నా అంగీకారము తెలిపాను. కాని ఆయన యిస్తానన్న పదవశాతం లాభం మాత్రం అంగీకరించలేదు. పని ప్రారంభమైంది. మిషను భాగాలు తిరిగినట్టె నాలో ఆలో చనలు తిరిగేవి. రాత్రింబవళ్ళు నిద్రలేక బాధపడ్డాను. రాత్రిళ్ళు పోలీసులు స్వప్న ములో తిరిగేవారు. కొన్నాళ్ళకు అలవాటు పడ్డాను. ఈ పని మొదలుపెట్టినప్పటి నుండి, మరీ ఒంటరితనమును ప్రేమించ డము మొదలుపెట్టాను. నా నీడను చూచి నేనే భయపడేవాడిని! అటువంటప్పుడే ''ప్రతీకారం'' కథ వ్రాశాను. అంత ఒంటరినైన నా జీవితంలో నువ్వు ప్రవే శించావు. నారాయణదగ్గర పని ముగించు కొని వస్తున్న నా కారుకు అడ్డంవచ్చావు. అశాంతితోఅలమటించే నాకు అచేతనంగా ప్రశాంతంగా నున్న నీ ముఖం చూడగానే యెంతో తృప్తికలిగింది. నిన్ను హాస్పి టల్లో చేర్చాము. అపరిచితురాల వయినా యెన్నో రోజుల పరిచయమున్నట్టు తో చింది. దానికి కారణము ఇద్దరి జీవితాలు ఒకలాంటివి కావటమే కావచ్చు. నీవు చెప్పిన కథ విన్నంతసేపు మా పిన్ని, బాబాయి గుర్తుకొచ్చారు. నిన్ను ఒదులు కోవాలని లేదు. ఈ రోజు నిజం చెపు తున్నాను సుశీ! నిన్ను మీ వారు ఇంట్లోకి రావద్దనే కోరుకున్నారు. అట్లాగేజరిగింది. కాని నా జీవితానికి స్థిరత్వంలేదు. నిన్ను అన్యాయం చేస్తానేమోనని బాధపడి గురు కులంలో చేర్పించాను. నీ ముఖం చూచాక నారాయణగారింటికి తరచూ పోలేకపోయే వాడిని. యెప్పుడయితే నిన్ను యింట్లో

సీరియల్

## జరిగిన కథ

సుశీల చిన్నతనంలోనే తల్లి-తండ్రులను పోగొట్టుకొని మేనత్త కనకదుర్గమ్మ దగ్గర పెరుగుతుంది. విధవరాత్తు అరవై ఏళ్ళ చలపతితో వివాహం నిర్ణయమనటంతో యింట్లోంచి పారిపోతుంది సుశీల. కారు యాక్సిడెంలో సుధీర్‌తో పరిచయమేర్పడుతుంది. శీలాన్ని పోగొట్టుకున్న శశిలో చలపతి వివాహమవుతుంది. సుధీర్ ఆదరణలో చదవటమే గాక అతన్ని వివాహం చేసుకుంటుంది సుశీల. దుర్గమ్మ కుటుంబ పరిస్థితి తారుమారైంది. శంకర్ శశికి మానసిక శత్రువైనాడు. కుమారుడు రాజా పెంపకంలో జాగ్రత్త తీసుకుంటోంది సుశీల. భర్త పూర్వ వృత్తాంతం అర్థం కాక సతమతమవుతుంది సుశీల. వర్షంలో తడుస్తున్న ఉమాపతి దంపతులను యింటికి తీసుకువస్తాడు సుధీర్. కోడవి జీవితాన్ని చూపి సంతోషించి కన్ను మూస్తాడు ఉమాపతి. సుధీర్‌పై పోలీసులు నిఘా వేశారు. గత జీవితాన్ని గురించిన ప్రశ్నలకు సుధీర్ సరైన సమాధానం యివ్వలేదు. తన పుట్టుక వృత్తాంతం చెబుతాడు. నిజం తెలుసుకోని బాధపడుతుంది సుశీల.

—ఇక చదవండి.

తెచ్చిపెట్టుకున్నానో. అప్పుడే నారాయణగారు నాపై చిరుబురుమంటూ. యేనాడు లేనిది యింటికి వచ్చి హెచ్చరించారు. నీ ప్రశాంతమైన ప్రవర్తనను పువ్వులా తిరిగే నిన్ను చూస్తూ యెన్నోసార్లు నా కథ నీకు చెప్పాలని, భయమువేసి ఊరుకునేవాడిని. నీ అంతట నువ్వే మన పెళ్ళికి అంగీకరించావు. సంతోషించాను. నువ్వు బంధువులను. స్నేహితులను పిలవాలని ఉత్సాహపడేవానివి నాలోని కల్మషమూ. బందు జనంయొక్క రాబందు బుద్ధులు నన్ను వారికి దూరంగా వుంచేవి. మనము ఢిల్లీ వెళ్ళినప్పుడే సింగ్ పట్టుపడ్డాడు. అప్పుడు త్వరగా వచ్చి. అతనిని విడిపించవల్సి వచ్చింది సింగ్ కావల్సి పటుపడ్డాడని నా అనుమానము. అతనికి నారాయణ యిచ్చేది సరిపోలేదు ఇంకా కావాలని పేచిపెట్టాడు. కనీసం నేను అంగీకరించని భాగమైనా తనకు, జాషువాకు ఇవ్వమని పేచిపెట్టేవాడు. నారాయణగారు ఒప్పుకోలేదు. దానితో అప్పుడే పట్టుపడ్డాడు. కొంతడబ్బిచ్చి విడిపించినా. అతని వాలకం అనుమానాస్పదంగా ఉంది. బాస్‌ను హెచ్చరించాను కూడా. ఇది రెండవసారి పటుబడటం....''

"మరి మీ పేరు చెప్పినాడట'' సుశీల ఇనస్పెక్టరుగారు చెప్పినదంతా చెప్పింది.

''నా పేరు సింగ్ చెప్పలేదు. లంచం ఆశచూపించి చెప్పించుకొన్నారు.''

''మీ బాబాయి చేసేపని అంటావా లేక యింకెవరయినా చేస్తున్నారా?''

''మా బాబాయిచేస్తున్న పనే. ఆ ఆస్తికై కోర్టులో దావా వేశాను కదూ?''.... తాత గారు రిజిష్టర్ చేసిన నాటి నకళ్ళు తెప్పించాను. డబ్బుంచే పనులు చాలా సులువుగా అవుతాయి, ఆ ఆస్తి నా కొచ్చినట్టే యిక యిన్నాళ్ళూ దానిమీదొచ్చే ఆదాయము వాడుకున్నాడు. అదిమాత్రం తావాలి. అతనికి మతిపోయింది. యిలా జరుగుతుందని ఊహించి ఉండడు నామీద పగబట్టాడు ఒకరోజు నేను ఢిల్లీలో ఆటోకోసం చూస్తున్నాను. నలుగురు రౌడీలు చుట్టుముట్టారు. జేబులోనుండి పిస్టలు తీయగానే అదిరిపోయారు. తాము డబ్బుకు గడ్డితిన్నామని, వదిలిపెట్టమని బ్రతిమాలారు. అప్పటినుండి ప్రమత్తుడనయి తిరుగుతున్నాను. నా గురించి, నారాయణగారి గురించి, విశాఖపట్టణము వచ్చి ఆరాలు తీయటం మొదలు పెట్టినాడట. మరి యెలా కనుక్కొన్నాదో సింగుకు మాకు పరిచయమని, సింగు పట్టుబడగానే అతనిని జామీనుపై విడుదల చేయించి, నాటకం ఆడుతున్నాడు ఆడనియ్యి, నేను సిద్ధంగానే ఉన్నాను'' తేలికగా ఊపిరి పీల్చుకున్నాడు సుధీర్.

''అదికాదండి. మరి ఆ సింగు చెప్పే అబద్ధాల వల్ల మీ పైకి కేసు రాదూ?''

''ఎందుకు రాదు. అప్పుడు చూద్దాము. చాలా రాత్రి అయింది నిదురపో.''

''నా నిద్రకేం రోగం? పడుకుంటానులెండి. కేసు మీ మీదకు రాకుండా చూచుకోలేరా? మీరే అన్నారుగా డబ్బుతో పనులు సాధించవచ్చునని'' సుశీల అడిగినది.

''సాధించవచ్చు. డబ్బు అవసరము లేదు. నేను కొంచెము మానవత్వము మరిచిపోతే నేను బయటపడాలంటే నారాయణగారిని, అతని మిషన్‌తో సహా పట్టించిననాడు. ఆ పని నేను చెయ్యలేను. సింగ్‌కు మిషన్ ఉందేస్థలం తెలియదు, అవన్నీ ప్రభుత్వం తెలుసుకొని నన్ను బంధిస్తారు. నా తప్పు ఒప్పుకుంటాను,

---

ధరలు పెరగకుండా వాటిని స్థిరీకరించే విషయంలో ప్రభుత్వం సర్వప్రయత్నాలు చేస్తుంది. అధికలాభార్జనా పరులు, దొంగ నిలువలు చేసే వ్యాపారాలు, బ్లాక్ మార్కెటు ధరలు మరింత అసాంఘిక శక్తులను అతికఠినంగా అణచివేయడం జరుగుతుంది.

పి. వి. నరసింహారావు

**ముఖ్యమంత్రి**

వా రే శిక్ష విధించినా అనుభవించటానికి సిద్ధంగా వుంటాను" అన్నాడు నిశ్చింతగా.

''నారాయణగారి విషయంలో అంత ఉదారత చూపే మీకు. మా విషయము పట్టలేదా? నన్ను,రాజాను ఏం చేద్దామని?'' ఈ సారి ఆమెగొంతు జీరపోయింది.

''సుశీ!'' ఆమెను దగ్గరకు తీసుకుని ఫాలభాగం ముద్దు పెట్టుకున్నాడు, ''మీ రిద్దరూ నా రెండుకళ్ళు సుశీ! నేను అను క్షణం మీ గురించే ఆలోచిస్తాను. నువ్వు యిరవై ఏళ్ళు నిండకముందే నూరేళ్ళు అనుభవించే కష్టాలు అనుభవించావు. ఇక నువ్వు హాయిగా ఉండాలి. రాజా భవిష్యత్తు ఉజ్వలంగా ఉండాలి. నాన్నగారు నన్ను విపరీతంగా ప్రేమించారు. నా కోసం యెన్నోచేశారు. నాకు సుఖజీవితం అలవాటు చేశారు. రాజాను అలా కాదు. మామూలు మనిషిగా పెంచాలి. అందుకే నిన్ను వారించాను. గుర్తుందా? రాజా పుట్టినరోజు ఘనంగా చేస్తానన్నావు. వద్దు, మన బిడ్డడు కష్ట, సుఖాలు తెలుసుకొంటూ ప్రపంచాన్ని అర్థంచేసుకుని, ఆడంబరాలకు దాసుడు కాకుండా పెరగాలి. నా విషయంలో ఏమీ దాచుకోలేదు. నీకు ఎలాతోస్తే అలాచెప్పు. చెయ్యడానికి సిద్ధంగాఉన్నాను. ఆలోచించి రేపు మాట్లాడుదాము? రాజా కదులుతున్నాడు చూడు.'' సుశీల లేచివెళ్ళి రాజా దోమతెర సరిజేసి వచ్చినది

''నేను కోరేదల్లా ఒక్కటేనండి.... మీరు ఆ వలయంనుండి బయట పడాలి. మీ మీదికి కేసు రాకుండా చూసుకోండి.'' అన్నది ప్రతిమాలుతూ.

''చూద్దాం. ప్రభుత్వము అన్ని విషయాలు సేకరించిననాడు శిక్ష అనుభవించక తప్పదు....నీకూ. రాజాకు ఏ లోటు రాకుండా చూస్తాను. నారాయణగారు ముందుగానే జాగ్రత్త వహించితే, ఎంత నిష్ఠూరమైనా వహిస్తాను కాని, అతనికి సహకరించను."

సుశీల ఏమో చెప్పబోయి మాని వేసింది.

''చెప్పు సుశీ! ఏ విషయములో సందేహము కలదు. నీకు వాస్తవం చెప్పాను." ఆమె ముంగురులు సవరిస్తూ అడిగాడు.

"మీ పరిస్థితి యిలా ఉంది ...నాకేమో మన రాజాకు చెల్లెలో తమ్ముడో పుట్టబోతున్నారు.''

''నిజం....దొంగా! చెప్పవేం.... తమ్ముడో అంటావేం-చెల్లెలే కావాలి.'' ఆమెను దగ్గరకు లాక్కున్నాడు. "నువ్వేం దిగులు పెట్టుకోవద్దు సుశీ! మనిద్దరి గత జీవితాలు యింత కంటే గడ్డుగానే గడిచినాయి. ఇప్పుడు కష్టసుఖాలు చెప్పుకోవడానికి ఒకరి కొకరము ఉన్నాము బ్రతుకు మీద ఆశలు కల్పించటానికి మన పిల్లలుంటారు. జీవితములో యిదే చాలా కష్టతరమైన మలుపు. ఆ తరువాత అంతా

నిశ్చింతగా ఉంటాము నా మనఃసాక్షి చెప్తోంది. ఒక్క విషయము - నువ్వు సంతోషముగా ఉంటే నాకెంతో బలము. ప్రొద్దుట నువ్వలా ఆవేదనతో అలమటించి పోతుంటే నేను ఎంత బాధ పడ్డానో ఎంత పశ్చాత్తాప పడ్డానో...." భర్త నోటికి చెయ్యి అడ్డం పెట్టింది.

"క్షమించండి మీరు అలాంటి పనులు చేస్తున్నారంటే సహించలేక పోయాను. మీకు కోపం వస్తే రెండు కొట్టండి తిట్టండి కాని. మాకు దూరం వెళ్తానని అనకండి. అది నేను సహించలేను" అన్నది అతని హృదయముపై తల పెట్టి.

"మీకు దూరముగా నేను మాత్ర ముండగలనా సుశీ లేటయింది పడుకో!" అన్నాడు.

ఆమె పడుకుంది. కాని నిద్ర పటలేదు. అతను మాత్రం నిశ్చింతగా నిదుర పోయాడు. ఆమెకు ఎన్నో ఆలోచనలు, ఎన్నో సందేహాలు చుట్టు ముట్టినాయి.... నిదురలోనే ఆమె చుట్టూ చేతులు వేసి దగ్గరకు తీసుకున్నాడు. అతని చెయ్యి ఆమెకు కంచుకోటలా అనిపించింది. . ఎప్పుడో నిదురబోయింది.

రాజా, సుధీర్ల అల్లరితో మేలుకుంది సుశీల. ఎదుటి బల్ల మీది గడియారము ఎనిమిది దాటి వెక్కిరించింది. త్వరగా లేచి వచ్చింది. సుధీర్ సన్నగా నవ్వాడు. సిగ్గుతో తల వంచుకుని పెరడు వైపు వెళ్ళింది.

* * *

"అమ్మా! నిన్ను తెలిసిన దానవనుకోనా. లేక వెర్రిబాగులదానవనుకోనా?" శశి కోపంగా ప్రశ్నించింది

ప్రసన్న మౌనముగా వింటోంది ... దుర్గమ్మ ప్రేమకు జెడ వేస్తూ కూర్చుని ఉంది.

"ఏమన్నా అనుకో! యిరవై ఆరేళ్ళు ఎలాగూ పెంచాను. ఇంకా రెండు ఏళ్ళు పెంచడానికేం అభ్యంతరము లేదు ఇల్లా అమ్మిన డబ్బుతో కట్నం యిస్తాను. పెద్ద మునినాపసానిలా అది చెప్పినదట, ఇది వచ్చిందట. రెండో సమ్మంధం! ఇద్దరు పిల్లలున్నారు. నేను యివ్వనుగాక— యివ్వను! నువ్వూ కన్నావు. నా బాధ రేపు అర్ధం అవుతుందిలే!" అన్నది ప్రేమ నెత్తిన పోటు పొడుస్తూ.

"నా నెత్తిన ఎందుకే పోట్లు పొడుస్తావు?" ప్రేమ కయ్యిని లేచింది.

"అమ్మా! అక్కయ్యంటే నాకు ప్రేమ లేదనా? ఆమె ఓ యింటిది కావాలనే నా తాపత్రయము. మొగపిల్లలు ఎట్లా తిరిగినా ఎవరూ ఆక్షేపించరు. వెంకట్ గురించి, సంపత్ గురించి ఎవరూ పట్టించుకోరు. ఆడపిల్లంటే అందరికి లోకువే! అక్కయ్యకు యిరవై ఆరేళ్ళు దాటాయి. ఇంకా




ఎప్పుడుచేస్తావు పెళ్ళి? అప్పుడు అక్కయ్య ఈడుకు తగిన వరుడు దొరకవద్దా?'' శశి ప్రశ్నించింది.

''మహా చెప్పొచ్చావు. అందరూ తమ పిల్లల పెళ్ళిళ్ళు సరయిన వయసు చెప్పే చేస్తున్నారుటే? ఇరవై రెండు అంటాను. నేను కోరిన విధంగానే దాని పెళ్ళి చేస్తాను. పోతే పోయింది, పాతిక వేలు కట్నం యిసాను. కనకదుర్గమ్మ ఊరమ్మడు పోయిందా? పేరమ్ముడు పోయిందా? నీకు ఘనముగానే చేయాలని కలలు కన్నాను. నా బంగారుతల్లిని నెత్తి మీదికి తెళ్ళ కుంటివి. మర్యాదకు పాటుపడి, పిన్న ఆ ముసలాడికి ధారపోసాను ''

''గతం త్రవ్వితే లాభం ఏమిటమ్మా? నాదెలాగో అయింది. అతనికి ముప్పై-ముప్పై రెండు కంటే ఎక్కువ లేవుట. స్కూల్లో అక్కయ్యను చాలా తడవలు చూచాడట. ఆస్తిపాస్తులున్నాయి. పిల్ల లుంటే ఏమయిందే? ఇన్ని జరిగినా నీకు కనువిప్పు కాకపోవటము ఆశ్చర్యముగానే ఉంది. నీ వెర్రి ప్రేమతో మా జీవితాలు పాడుజేశావు.''

''ఏమిటే వాగావూ? మళ్ళా అను

ఆ మాట. వెర్రి ప్రేమా నాది? మీ జీవితాలు నేనేం జేశానే! కళ్ళు నెత్తికి వచ్చి యిష్ట మొచ్చినట్టు తిరిగి, యిప్పుడు నన్నం టావు?''

''అమ్మా! అరుపులెందుకే .. బయట జీతగాళ్ళు వాళ్ళుంటారు. ఒకటికి రెండు కల్పించి ప్రచారం చేస్తారు.'' ప్రసన్న నెమ్మదిగా జవాబు చెప్పింది.

''నువ్వూ నన్నే అంటావేమే! అది ఎంతెంత మాటలంటున్నదో చూడు. నా పిల్లలు రాజాల్లా పెరుగుతారని, ఆయనను కూడా లెక్క చెయ్యక మిమ్మల్ని నెత్తిన పెట్టుకున్నాను. కొండ మీది కోతి కావా లన్నా తెచ్చి యిచ్చాను.'' ఆమె ఏడ్పు మొదలు పెట్టింది.

''ఈ యింట్లో ఏడుపు చవకై పోయింది. కొండ మీది కోతినిచ్చే మమ్మల్ని కోతు లను చేశావు. మొన్నటికి మొన్న, బ్యాంకు లోంచి డబ్బు తీసి పెద్దన్నయ్యకెందు కిచ్చి నట్టు? ఇదివరకే కొంప గుండమయి పోయినది. నగలు, నాణ్యాలు నాశనం చేశాడు ...''

''కావాలంటే అందరినీ అడుగు.... వాడెంత మారిపోయినట్టు కనిపించాడో? చక్కగా యింటి పట్టునే ఉండి వ్యవ సాయము పనులు చూచుకున్నాడు. బాధ్య తగా తిరిగినాడు. ఇంజను అయితే వ్యవ సాయం సాగిస్తాను. రెండింతలు పంట పండిస్తాను అంటే నిజమేననుకున్నాను. నాకేం తెలుసు యింత మోసమని.... పరాయి వాడయితే ఏమో అనొచ్చు— స్వంత కొడుకు. కాదని ఎట్లా అంటాను? నా రాతనే బాగలేదే తల్లీ! మీ అందరిచేత పడే దినము వచ్చింది ''

''ఇదొక గోల.... అది కాదే! ఉన్న యిల్లమ్మి అక్కయ్యకు కట్నం యిచ్చి, రేపు ప్రేమను, వేణును ఏం చేద్దామని?'' శశి ఈసారి మంచిగా అడిగింది.

''ఏదో ఒకటి అవుతుందిలే! నీకు అక్కయ్య మీద అంత ప్రేముంటే ఓ పని చెయ్యరాదుటే!''

''ఏదో ఒకటి అవుతుందిలే! నీకు అక్కయ్య మీద అంత ప్రేముంటే ఓ పని చెయ్యరాదుటే!''

''ఏం చెయ్యాలో చెప్పమ్మా? నాకు చాతనయిందయితే తప్పక చేస్తాను ''

''చాతకాని పనేం కాదులే! మీ మారుటి కొడుకు బావమరిది చక్కగా ఉన్నాడు. ఇంజనీరో ఏదో చేస్తున్నాడు మీఅయనను వెంట బెట్టుకుని, వెళ్ళి ఆ సంబంధము మాట్లాడు.''

''అమ్మా! వాళ్ళ విషయము నీకు తెలియదు. లక్ష రూపాయల కట్నం, వేరే లాంఛనాలమీదున్నారు. మా అబ్బాయే ఎన్నోసార్లు తిట్టుకోగా చూచినాను. వారి పద్ధతులే వేరమ్మా!''

''వాళ్ళకు అర్హత ఉన్నది అడుగు

తారు. పిల్లను చూస్తే వాళ్ళే ఉద్దేశాలు మార్చుకుంటారు.''

''అక్కయ్య కంటే అందమైన అమ్మాయిలనే చూచారమ్మా! ప్రతి అమ్మాయికి ఏదో ఒక వొంక పెట్టడము, వద్దనటము. ఏమాత్రము అవకాశమున్నా, నేను నా సాయశక్తులా ప్రయత్నించే దానను. అమ్మా! అలాంటి వారు ఊరికే చేసుకుంటామన్నా అక్కయ్యను యివ్వ కూడదు.''

''పోవే పెద్దకబుర్లు ...ఈ వెంకట్ వెధవ మూలానగాని లేకుంటే చలపతి మామయ్యను ఒప్పించకపోదునా? చూద్దాము దాని అదృష్ట మెలాఉందో'' దుర్గమ్మ ఆశగా చూచింది.

''అమ్మా! నేను చెప్పేది చెప్పాను, నీ యిష్టం. అక్కయ్య చిన్నపిల్లకాదు, అందరూ ఆలోచించండి, మన విషయాలే కాక ముందు మన వెనక వారిజీవితాలు కూడాచూడాలిగా! చిన్నప్పుడే ఆలోచనలు అభిమానాలు లేక అంతా....తారుమారు చేసుకున్నాము'' విసురుగా చెప్పి లేచింది. శశి.

''వేణు పాపను తీసుకొని వచ్చాడు. చక్కగా కబుర్లు చెప్తుంది పాప. వెళ తాను అక్కయ్యా''

శశివెనకాలే ప్రసన్న వెళ్ళింది పాపను ముద్దిడుతున్నది.

''శశీ! అమ్మమాటలు పట్టించుకోకు. కోపం తెచ్చుకోకు. ఆమెది ఒక విధమైన తత్వము. ఇక మారదు. మనం విసిగించి ఆమె నింకా గాయపరచవద్దు అతను నన్నిష్టపడితే వివాహానికి ఒప్పుకో! నా కిష్టమే, బయటివారు నిన్నేకాదు. నన్నూ సూటిపోటి మాటలతో అనవల్సినవన్నీ అంటున్నారు. నేను భరించి ఊర్కుంటున్నాను. సిగ్గువిడిచి నాకు పెళ్ళి చేయి అమ్మా! అని ఈ పరిస్థితులలో యెలా అడగను? మనం యెన్నో అనుకుంటాం అన్నీ కావు. ముసలివాడితో నువ్వు కాపరం చెయ్యటం లేదా?'' నిట్టూర్చింది ప్రసన్న.

శశి ఆపుకోలేని దుఃఖంతోవచ్చి అక్క భుజంపై తలవాల్చి ఏడ్చింది.

''అక్కా! నువ్వు బాధతో ఈ నిర్ణయానికి రావద్దు, బాగాఆలోచించు? నన్ను

---

దేశ రక్షణకు మన సర్వశక్తులను కేంద్రీకరించే సంకల్పంతో మనం ప్రజల నందరిని సమీకరించాలి.

పి. వి. నరసింహా రావు
**ముఖ్యమంత్రి**

ఉదాహరణగా తీసుకోకు. పగవారికికూడా నావంటి జీవితం వద్దు నేను గ్రుడ్డిగా ప్రవర్తించినందుకు నాన్నను లెక్కచెయ్యనందుకు ఫలితం అనుభవిస్తున్నాను. నీ జీవితం సుఖప్రదం కావాలని నా వాంఛ'' శశి కన్నీరు వత్తింది.

''ఛ. ఊరుకో చెల్లీ. నేను మూందటి ప్రసన్నను కాను. జీవితం అనేకమైన పాఠాలు నేర్పినది. అహంకారము. అభిమానము. అతిశయమూ అన్నీనశించాయి. నేను మామూలు స్త్రీని. నేను హృదయపూర్వకంగా అంగీకరిస్తున్నాను అతనిని చూడవలసిన అవసరంలేదు. అన్ని విషయాలు నువ్వు మాట్లాడు. వచ్చేఏడు ప్రేమ హైస్కూలుచదువు అయిపోతుంది దాని విషయం చూడాలి'' అన్నది.

''దాని విషయం తరువాత ఆలోచించవచ్చు. మరి నేను అన్నీ మాట్లాడినాక, అమ్మ పేచి పెడతుందేమో;....'' కారులో కూర్చుని అడిగింది.

''మరేం ఫరవాలేదు. అమ్మ పేచీలకు భయపడే నాన్నగారు తనను తాను చంపుకున్నారు. నేను నచ్చచెప్తాను.''

కారు కదిలి పోయింది. ప్రసన్న భారంగా షెడ్డులోకి వెళ్ళింది. ఆమెకు తన నిర్ణయము సమంజసముగానే తోచిందే కాని తప్పుగా అనిపించలేదు.

''ఏమిటే అది అక్కడ మూరి పోస్తుండి?' దుర్గమ్మ అడిగింది.

"నేవేం పసిదానవా అమ్మా! అది చెప్పింది సమంజసమేననిపించింది. ఒప్పుకున్నాను.

''ఏమిటే. నేను న్నానని మరిచి పోయావా?'' కోపంగా మీదికి వచ్చిందావిడ.

''అమ్మా! నువ్వెన్నావు! ఇంట్లో ఉంటావు. నా విషయము నీకేం తెలుసు? ఇంట్లో పొరపాటు ఒకరిదయితా శిక్ష అందరూ అనుభవించాలి....నా ఎదుట మంచిగా పలుకరించినవారే నా వెనుక.... చూడు-అవెళ్తుందే ఆవిడ చిన్న పిల్లలా జెడ వ్రేలాడేసుకుని వస్తుంది. ఏం భాగవతమో ఏమో, చెల్లెలికి పెళ్ళయి ఓ అమ్మాయి కూడా ఉంది, ఇంకా ఈవిడకు కాలేదు.' అని ఒకరంటే, ఆ కాలేజిలో చదివిందటగా! ప్రేమ వ్యవహారమేమో లే' అని మరొకరు. ఇంకా నీచాతి నీచంగా అంటారు. నేను పేరంటాలకు పోవడము మాని ఎన్ని రోజులు అయింది? ఈ జీవచ్ఛవమైన బ్రతుకు కంటే. ఎక్కడో ప్రశాంతంగా దాపటము నయముకదూ!! మరో రెండేళ్ళలో ప్రేమ పెళ్ళి కెమగుతుంది దాని పెళ్ళికి నేను ఆటంకముగా నుండరాదు.'' అని అవతలికి పోయింది.

'మీ యిష్టం? తల్లి బిడ్డాలాటి విక్తలు గడచిపోతా? నా కోరిక ఏది తీర్చాలని భగవంతుడు ...తమ్ముడిని ముద్దుగా పెంచి, పెళ్ళి చేద్దామంటే-వాడో కులం లేనిదాన్ని




తెచ్చుకునే పిల్లలో పీట చెక్కలో అంటే వాడో దాన్ని కట్టుకునె. వీడు ఊరు మీద తిరుగుతూ గడిపే ఆడపిల్లలను అయినింటి కిచ్చి నల్గురు మెచ్చుకునేటట్టు చేద్దామంటే దాని రాతట్లా ఏడ్చింది. దీని రాత యిట్లా తుడిచింపె." అని కళ్ళు వత్తుకుంది.

వేణు పరుగెత్తుకొచ్చాడు. "అమ్మా! చిన్నన్నయ్య ఉత్తరమే!" అని తెచ్చి నాడు.

ఆత్రంగా అందుకుని విప్పింది.. "వీళ్ళతో రోగం. అమ్మకు ఇంగ్లిషు రాదని తెలియదూ? అక్కయ్యను యిలా పిలువు "

వేణు వెళ్ళి ప్రసన్నను పిలుచుకు వచ్చాడు. ఉత్తరం యిచ్చింది. ప్రసన్న ఉత్తరం విప్పి చదివింది. "చిన్నన్నయ్య వ్రాశాడు? అతనికి అక్కడ విసుగెత్తిం దట! ఇక్కడికి వస్తున్నాడట? ఇక్కడే ఉంటానని వ్రాశాడమ్మా!" అన్నది.

"ఇన్నాళ్ళకు జ్ఞాపకం వచ్చామా? పోనీలే వాడికైనా మంచిబుద్ధి పుట్టింది. అదేచాలు యిల్లు కలకలలాడుతుంది." ఆ రోజు యింట్లో అందరూ సంతోషించారు. రెండవరోజే వేయి రూపాయలు అప్పు తెప్పించి మరో షెడ్డు వేయించటం ప్రారంభించింది.

(సశేషం)

# కొన్ని నిజాలు

ప్రపంచ ప్రఖ్యాత కథానికా చక్రవర్తి ఓ. హెన్రీ తను రాయబోయే కథలకు అనేక పత్రికల నుండి ముందుగానే డబ్బు తీసుకొని ఖర్చు పెట్టేసేవాడు. కాగితంపై కలం పెట్టకుండా కిమ్మని కూర్చొనేవాడు. పత్రికాఫీసు నుండి గాభరాతో ఎడిటర్ ఫోన్ చేసి "ఇంకా కథ పంపలేదేం? ఎల్లుండి పత్రిక విడుదల!" అన్నాడు.

"అంతా తయారై వుంది! మీ మనిషిని పంపండి" అన్నాడు హెన్రీ.

ఇదే విధంగా తనకు పత్రికాఫీసు నుండి వచ్చిన ఫోన్లు అన్నింటికి జవాబు చెప్పి డ్రాయింగ్ రూంలో తాపీగా పైప్ తాగుతూ కూర్చున్నాడు.

పత్రికాఫీసుల నుండి వచ్చిన మనుషుల్ని బయట కూర్చోబెట్టి ఒక్కొక్కరినీ లోపలికి పిలిచాడు.

"స్క్రిప్టు తయారయిందా? మాకు టైం లేదు త్వరగా యివ్వండి" అన్నాడాతడు.

తన తలవైపు చూపిస్తూ "అది యిక్కడ భద్రంగా వుందిలే! కాగితం, కలం తీసుకో, డిక్టేట్ చేస్తాను" అన్నాడు హెన్రీ.

ఇలా వచ్చిన వారందరినీ లోపలికి పిలిచి అప్పటికప్పుడు కథలు అల్లి పంపేశాడు. ఎన్నో గొప్ప కథలు యిలా చెప్పబడినవే!

* * *

ఒకసారి లండన్‌లో ఫ్యాన్సీ డ్రస్‌బాల్ జరిగింది. ప్రముఖ వ్యక్తుల వేషాలు వేసుకొని ఒక్కొక్కరే స్టేజి పైకొచ్చి నిలబడి పోయారు.

చివరలో చార్లీచాప్లిన్ వేషధారి వచ్చి నిలబడి దిగిపోయాడు.

రెండో బహుమతి 'చాప్లిన్' వేషధారికొచ్చినట్టు ప్రకటించబడింది.

"ఆ వేషంలో స్టేజి పైకొచ్చింది స్వయంగా నేనే! అయినా మొదటి బహుమతి నాకు రానే లేదు. ఈ లోకంలో నకిలీ వారికే విలువ జాస్తి!" అన్నాడు చాప్లిన్ నవ్వుతూ ప్రక్కనున్న వారితో.

కొల్లికుదురు రాజశేఖర రెడ్డి.

# రంగ రింపు

కష్టజీవి కను సన్నలలో
స్వేదబిందువుల బరువులో
యెంతో సంతోషం యిమిడింది—

గంపెడు సంసారంతో గంద్రం
అమ్మ జూపెడి వాని మస్తిష్కంలో
మహోల్లాసం పొద సూపింది ..

అతిలౌక్యం వున్న వాటిలో
సౌఖ్యం నిలయం
పాప భీతికి ఆలంబనంగా
ప్రతీ హృదయంలో
మయం దేవాలయం

ఎదుటి వాణ్ని అర్థం చేసుకుని
నడుచుటలో ఎంతో మేలు
"కృషితో నాస్తి దుర్భిక్షం'' విదర్శనం
పంట చేలు

అడిగేవానికి చెప్పేవాడు లోకువ
నానుడి లోక ప్రశస్తం
మంచి మనస్సు — మంచి నడవడి
గలవానికి
తలొగ్గును సమస్తం

నేస్తం
శాస్త్ర సమస్తం
పరికించు
మంచిని మనసు మిరా
రంగరించు.... .... .. .... ....

కొప్పర్తి రామారావు.



# మారిన కాలం మారని మనిషి

పవని నిర్మలప్రభావతి

"ఈపీడ రేపటితో వదలిపోతుం దినాకు!" నెత్తిమీదవున్న గడ్డి గంప విసురుగా నేలమీద దొర్లా పడేస్తూ అంది శేషమ్మ. వసారాలో మంచం మీద కూర్చుని వున్న వెంకటాద్రికి శూలాల్లా తగిలాయామాటలు.

"ఔనౌను! రేపట్నుంచి గోళ్ళుగిల్లుకుంటూ రాణీలా కూర్చోవచ్చు నువ్వు. నేనేమో ఎముకలు విరిగేలా వూరు వూరంతా చుట్టి రావచ్చు!" అన్నాడు [illegible]

శేషమ్మ క్షణకాలం దిమ్మెరపోయింది. ఈ వేళప్పుడు భర్త అలా వసారాలో పని లేకుండా కూర్చుని వుంటాడని ఆమె

వూహించలేదు. మాట్లాడకుండా కొద వలి చూరులో దోపి గడ్డిగంప తేవటం మూలాన మాడు మీద గుంటలా వున్న జుట్టు సరిచేసు కుంటూ గుడిసెలోకి వెళ్ళింది. ''ఎట్లాగూ రేపటితో శని వదిలి పోతూవెవుండె ఈ కాస్సేపులోపల నేనే దైనా అంటే తెగవుడుక్కుంటాడు. పోనీ కాస్సేపు నేనే నోరు మూసుకుంటే సరి పోయె!'' అనుకుంటూ బుడ్డిదీపం వెలి గించే ప్రయత్నంలో పడింది.

వెంకటాద్రికి మాత్రం వెర్రి కోపం అస్పర్శకు ఏళ్ళ తరబడి అలవాటు పడి పోయిన ప్రాణి ఓ విధమైన పరవశ త్వంతో క్షణకాలం అలా నిలబడి మెల్లిగా తిరిగి గడ్డితినేస్తోందది.

''మీ అమ్మ నిన్ను కన్నప్పుడు దగ్గ రున్నాం నేనూ మా అయ్యా! నీకు ''ముత్యాలు''అని ముద్దుగా పేరెట్టింది నేనే! నీకు పచ్చగడ్డి పరకలు కొరకటం నేర్పింది నేనే! నీకు కళ్ళెం తగిలించి బండికి కట్టింది నేనే! ... ఆనాటి నుంచి ఈనాటి వరకూ నువ్వూ నేనూ....ఒక

---

ఏటికి కొత్త నీ రొస్తే పదిలంగావున్న పాత నీటిని కూడా సముద్రం పాలు జేస్తుంది. అవినీతి ప్రబలుతున్న నవ నాగరికంలో నీతి గతి కూడా అంతే!

---

ముంచుకవస్తోంది. శేషమ్మకి రోజూ పీడగా కనుపిస్తున్న ఆ గుట్టం .. ఆ బండీ తనకు మహాలక్ష్మిలా తోస్తాయి ఎల్ల వేళలా! రేపటితో ఈ గుట్టం, బండి తమ కళ్ళ ముందు నుంచీ, గుడిసె ముందు నుంచీ వెళ్ళిపోతాయి. పీడ వదిలి పోతుందనీ తనకిగడ్డి కోసుకొచ్చే పని తగ్గిపోతుందనీ మురిసి పోతోందది. కానీ మహాలక్ష్మి కదిలిపోతుందని పిస్తోంది తనకు.

వెంకటాద్రి లేచి, గంపలో గడ్డి గుట్టం ముందు వేశాడు. అది ఆశగా తింటోంది మెల్లిగా వెన్నంతా నిమిరాడు తల్లి పిల్లల్లా ...(ఛ....ఛ ఒక్క తల్లి పిల్లలు మనుషులైతే ఎంతగా తన్నుకు చస్తారు? ఆ పోలిక పెట్టడం నాదేతప్పు!) స్నేహితుల్లా మెలిగాం ఈ రోజు నిన్ను అమ్మేయ్యాలంటే నా కెంత బాధగా వుందో నీకు తెలుసా,''

గుట్టం వెన్ను నిమురుతున్న వెంక టాద్రి చెయ్యి వణికింది.... ''తిను... తిను ఆది మెక్కుతూ, మూలుగుతూ ఏడుస్తూ తిరుగుతూ తెచ్చిన ఈ గడ్డి .. ఆఖరుసారిగా తిను ఆతర్వాత రేపట్నుంచీ నీ ఖర్మ ఎలా వుందో నాఖర్మ ఎలా వుంటుందో....?''

వెనక్కి వచ్చి వసారాలో మంచం మీద కూర్చున్నాడు వెంకటాద్రి. సంధ్య చీకట్లు బాగా ముసురుకున్నాయి, బుడ్డీ దీపం తెచ్చి వాకిటి గూట్లో పెట్టి వెళ్ళింది శేషమ్మ. వెంకటాద్రి చుట్టూరా చీకటిలానే పరుచుకుంటున్నాయి ఆలోచనలు అతగాడి కళ్ళముందు తన యవ్వనపు రోజులు సినిమా రీలులా తిరుగటం మొదలెట్టాయి.

* * *

అప్పటికి నెల్లూరు ఇంతగా పెరగ లేదు. నాలుగు సినిమా హాళ్ళు. ఒక కాలేజి మాత్రమే వుండేవి। అటువైపు కట్టకు ఇవతలగావి, అవతలగావి ఇన్ని ఇళ్ల లేవు। అక్కడా అక్కడా ఒకటి అరా విసిరి వేసినట్లుండేవి. ఇన్ని బస్సు ల్లేవు। కోవూరుకూ, అల్లూరుకూ, బుచ్చిరెడ్డి పాళేనికీ పడుగుపాడుకూ. రాజు పాలేనికీ మధ్య జోరుగా పరుగెత్తుతుండేవి గుర్రపు బండ్లు। ఎవరో ఒకరో అరా కారున్న మహారాజులు మినహా, స్వంత గుర్రపు బండ్లమీద వెళ్లేవారు చాలా మంది।

వెంకటాద్రికి పిల్లని ప్రానంటూ వచ్చిన రామయ్య వెంకటాద్రి వాకిట్లో వున్న బండినీ వసారాలో ఓ మూలగా కట్టేసి వున్న బలిష్టమైన గుర్రాన్నీ చూచి తెగ ముచ్చటపడి పోయాడు। కాబోయే అల్లుడి కంటే ...ఆ ''ఆస్తి'' చాల గొప్పగా కనిపించిందతగాడికి. పిల్ల సుఖపడటానికి ఇంతకంటే ఏం కావాలి అనుకున్నాడు. ''రాజా'' లాటి గుర్రం. బండీ మహా రాజాలా సంపాదించుకొనే వచ్చని శేషమ్మ కూడా సంతోషించింది. తన భర్త ''కలిగిన'' వాడేనని సంబరపడింది. దానికి తోడు ఓ బిడ్డ తల్లి అయ్యే వరకూ వెంకటాద్రి శేషమ్మకాలు కింద పెట్టనివ్వ లేదు. సినిమాకు పోవాలన్నా గుర్రపు బండిలోనే. రంగ నాయకుల కోవెలకు వెళ్లాలన్నా గుర్రపు బండిలోనే. వెల్లూరంతా తిప్పి చూపించాలన్నా బండే। సంత జరిగినా తిరణాల జరిగినా తేరు మీద వూరేగే దేవుడిలా వూరేగించేవాడు.

''బాడుగ పోతుంది మావా। ప్రతి చోటికీ బండెందుకూ।'' అనేది శేషమ్మ గునుస్తూ।

''నీ కంటే ఎక్కువేటి బాడుగ, కాకున్నా సొంతబండీ, సొంత గుఱ్ఱం. మనిష్ట మొచ్చినప్పుడు మనిష్ట ప్రకారం తిరగొచ్చు। రెండుట్రిప్పులు కోవూరుకో, పడుగుపాడుకో, రాజాపాలేనికో .... బుచ్చికో ఏసుకున్నానంటే నాలుగు రోజులు మనిద్దరం జలసాగా బండిమీద వూరేగొచ్చు.... ఏమంటావ్?'' అనేవాడు వెంకటాద్రి గర్వంగా। అసలా వీధిలో చాలామంది ఆడవాళ్లు ముఖ్యంగా కొత్త కోడళ్లు శేషమ్మ వైభవం చూచి ఈర్ష్యపడే వాళ్లు

''అదృష్టమంటే దానిది। చక్కగా






ఎక్కడికి వెళ్లాలన్నా బండి .... మహా రాణీలా!'' అనుకొనే వారు. శేషమ్మ వినేలా కూడా అనేవారు। అమాటెంతో గర్వంగా ముగుడితో చెప్పుకొనేది శేషమ్మ।

''మన ముత్యాలు చల్లగా ఉండాలే గాని మన కేమిటి లోటు?'' అనేవాడు వెంకటాద్రి గర్వంగా। ఆ హుంషారు కొద్దీ శేషమ్మ. వెంకటాద్రి అటు బండి కట్టుకెళ్ళగానే .... ఇటు గడ్డికి పోయేది। ఏటుచూచినా కావలసినంత బీడు....పచ్చని గడ్డి....అక్కడక్కడా చిన్న చిన్న మదుగుల్లో గుర్రాలకు నెత్తిమీద పెట్టేందుకు తమాషాగా ఉండే రంగురంగుల పూలు। రెండుగంటలలో నాలుగు గంపల గడ్డి దోక్కొని, నాలుగు పూలు లాక్కొని ఇంటికి రావటం శేషమ్మకు అలవాటైపోయింది. గుర్రం తినంగా మిగిలిన గడ్డి. బండిలో మెత్తగా పరచి, ఇంకా మిగిలితే గోనెపట్టలో వేసి. బండి క్రింద వుయ్యాలలా వ్రేలాడదీసి.... ''పద ముత్యాలూ'' అంటూ గుర్రాన్ని బండికి కట్టి....''నీ హస్తవాసి శేషూ। ముత్యాలు రోజుకో వన్నెతో పంచ కల్యాణిలా తయారవుతోంది।'' అంటూ భార్యకేసి కన్నుగీటి, బండిలో బోర్లా పడుకొని చెలకోల కొయ్య శబ్దం చెయ్యగానే.... పంచకల్యాణిలానే పరుగు తీస్తుంది ముత్యాలు....

బండికి ముత్యాలును అలవాటు చేసే కొత్తలో బాగా కూర్చునేవాడు వెంక

టాద్రి. "నే పుట్టినప్పట్నుంచీ చూస్తున్నా రా ముత్యాలూ! ఈ నెల్లూరు రోడ్లు ఇట్లాగే ఉన్నాయి! ఎక్కడ గుంటో, ఎక్కడ మిట్టో. నాకే... నా కేమిటి? ఈ రోడ్లేసిన కాంట్రాక్టర్లకి ....ఆ భగవంతుడికీ కూడా తెలీవు! వర్షమొస్తే చాలు.... ఇక రోడ్లే నదులు.....అదుగో ఆఅండర్ బ్రిడ్జి వుంది చూశావూ....అదో సముద్రమైపోతుంది! ఎక్కడిబండ్లక్కడ "ఆల్టు" ఐపోవలసిందే! కళ్ళుమూసుకొని తోకేవు ....అన్యాయంగా ఇద్దరం చస్తాం!....నే చెప్పినట్టను....అసలే ఈ రోడ్లు ఇరుకు దానికితోడు రెండువేపులా మురిక్కాలువలు, మురిక్కాలవల మీదికి ఇళ్ళూ... జాగ్రత్తగా పరుగెత్తు!" అంటూ గుర్రానికి అస్తమానం హెచ్చరికలు చేసేవాడు. తెలిసినవాళ్ళెవరైనా "అదేమిట్రా వెంకటాద్రీ! దానితో కబుర్లు చెబుతావ్! అదేం మనిషా? నీకు మతిపోయిందా?" అంటూ ఎగతాళి చేసేవాళ్ళుకూడాను.

అలాటప్పుడు వెంకటాద్రి నవ్వేస్తాడు "అది గుఱ్ఱంగా పుట్టిందిగానీ. మనిషి కంటే మాబాగా మాట వింటుంది!"

...నిజమే! ఓ రోజు .... నెల్లూరు నుంచి బుచ్చివరకూ బేరం కుదుర్చుకున్నారు ఓ భార్యా; భర్త, భార్యతల్లీనూ తల్లి కూతుళ్ళు ఏనుగుల్లా వున్నారు.... ఆ అల్లుడు బొత్తుగా పీనుగులా వున్నాడు! బండిలో వాళ్ళు కూర్చున్నాక....కర్ణుడి రథంలా భూమిలోకి బండీ గుఱ్ఱము దిగిపోతున్నా యనిపించింది వెంకటాద్రికి ... "బరువెక్కువైంది!" అంటూ గొణుక్కుంటుంటే .... ఎక్కడూ, దిగుడూ వచ్చినచోటల్లా, తుండ్లలా వున్న తల్లికూతుళ్ళు అలాగే కూర్చుని, చీపురుపుల్లలాటి అల్లుణ్ణి మాత్రం దింపేశారు ... బండి విరుగుతుందని, అలాటి ఎందరినో అవలీలగా లాక్కువెళ్ళటం అలవాటయిపోయింది ముత్యాలుకు. రోడ్లకు ఎక్కడ గతుకులు వున్నాయో, వర్షాకాలమైనా కనిపెట్టే మెలకువ వచ్చేసింది! ఎందరో పెళ్ళివారు, మరెందరో కొత్త దంపతులు, ఎందరో రోగులు .... ఎంతెంతదూరమో ప్రయాణించేవారు.... ఓ అమ్మాయి .... బాగా కలిగినింటి ఆడపడుచు ... బండెడు నగలతో బండిలో కూర్చుంది! ట్రంకు రోడ్డు దాటేసరికి ఓ కుర్రాడు వచ్చి కలిశాడు ...స్టేషన్‌కు తీసుకెళ్ళమనిచెప్పాడు ....త్రోవ పొడుగునా ఇద్దరూ మదరాసుకు వెళ్ళిపోవాలనీ ... పెళ్ళాడాలనీ ... ఏదేదో మాట్లాడుకుంటున్నారు. వెంకటాద్రికి అర్థమైపోయింది అసలు సంగతి. ఆ అమ్మాయి తండ్రిపేరుకూడా తెలిసిపోయింది వాళ్ళిద్దరి మాటలలో .... స్టేషనులో ఇద్దరూ దిగగానే .... వెంకటాద్రే వాళ్ళవెనకాలే వెళ్లాడు....మద్రాసుకు వెళ్ళే బండి ఓ గంట లేటుందని తెలిసింది. గబగబా స్టేషనుమాష్టరు దగ్గరకెళ్ళి రహస్యంగా అసలు సంగతి చెప్పి, ఎలాగైనా

తను తిరిగి వచ్చేవరకూ వాళ్ళని ఓ కంట కనిపెట్టమనిచెప్పి బండిలో వచ్చిపడ్డాడు। ....''ముత్యాలూ పదరా। అవతల కొంప మునిగిపోతోంది। అయినింటి ఆడపిల్ల.... కళ్ళకు గంతలుకట్టని గుర్రపిల్లలా ఎగిరి పడుతోంది, ఏదిగుంటో ఏదిమిట్టో తెలియనంత దూకుడుగా దూసుకుతోంది; ఆకుర్ర వెధవ... షోకీలా వెధవ.... ఆ పిల్లనగలు కాజేస్తాడు....నాశనం చేస్తాడు...మనిద్దరం వుండగా.... అలాటి ఘోరం జరగనివ్వ కూడదు ...పదపద....!": అతగాడి భాష, బాధ ముత్యాలుకు అర్థమైందిలా వుంది.... గాలిలో తేలిపోతున్నట్టు.... పరుగెత్తింది ....ఆ అమ్మాయి తండ్రి....కబురు తెలిసి అదిరిపోయాడు....ఇంటిల్లపాదీగా గాభరా పడిపోయారు ..కారున్న సంగతే మరిచి పోయి .. బండిలోకి దూకాడు ఆ తండ్రి కంగారులో ఓ ఫర్లాంగ్ సాగాక

"అరె కారులో పోవాల్సింది! ట్రెయిన్ వస్తుందో ఏమిటో!" అంటూ బాధపడ్డాడు. ''గాభరా పడకండి బాబూ! కారుకంటె తొందరగా తీసుకుపోతుంది మాముత్యాలు. స్టేషను మాస్టరుకి చెప్పొస్తాను గా!'' అంటూనే స్టేషన్‌కు ..నిజంగా కారంత వేగంగానేచేరుకుంది బండి। పిల్ల తండ్రిని చూచి కుర్రవాడు జారుకున్నాడు.... అమ్మాయి కుక్కిన పేనులా వచ్చేసింది తండ్రివెంట!.... ఆ తర్వాత ఓ సంవత్సరం జరిగాక కాబోలు! ఓ సారి వాళ్ళ కారు చెడిపోతే . .ఆ అమ్మాయి....ఆమె భర్త... వెంకటాద్రి బండిలో సినిమాకు వెళుతూ.. సరసా లాడుకుంటూంటే, వెంకటాద్రి నవ్వుకున్నాడు . ''విన్నావా ముత్యాలూ! ఈ పిల్లే . ఆ వెధవెవడితోనో లేచిపోయి ...ఇంతక్కాటి బ్రతుకునీ బుగ్గిపాలు చేసుకుందారోజు! ఇవాళ చూడు ... నన్నూ, నిన్నూ గుర్తు పట్ట లేదు। పోనీలే ఓ మంచిపనిచేశాంకదూ!'' వెంకటాద్రి మూగభాష ముత్యాలుకు అర్థమైనట్లు ...చిన్నగా సకిలించింది. ..

పదేళ్ళు గిర్రున తిరిగాయి....

సినిమాహాళ్ళు పన్నెండు అయినాయి! ఇంటిమీద ఇల్లుగా ఇళ్ళు వెలిసిపోయాయి!

రోడ్లప్రక్క నున్న మురుగు కాలువలు మరింత మందంగా... మరింత కంపు కొడుతూ ప్రవహిస్తున్నాయి . రోడ్లు మరి కాస్త ఇరుకుగా. ఇంకా ఎగుడు దిగుడులుగా ...తయారయ్యాయి... ఆడపిల్లల కాలేజి వెలిసింది. వీధికి పదిఆస్పత్రులూ, పది హేనుమంది డాక్టర్లూ, మొలుచుకు వచ్చారు. హోటళ్ళూ, లాడ్జీలూ, ట్రోతల్ హౌస్‌లూ....

సైకిల్ రిక్షాలు వచ్చేశాయి! బస్సులూ. టౌన్ బస్సులూ వచ్చేశాయి!

శేషమ్మ ఐదుగురు పిల్లలతల్లయింది! ఇంతక్రితంలా పచ్చిక బయళ్ళు లేవు.... అక్కడంతా ఇళ్ళూ ఆఫీసులూ....కొత్త కొత్త "నగర్"లూ వెలిసిపోయాయి! గుర్రప్పాలు కూడా ఆట్టేలేవు. రెండు గంటలు పోయేలా దోకుడుపాకతో, కొడవలి లిక్కతో నేల చెక్కినా గంపతో. గంపెడుగడ్డి పోగవటంలేదు; పచ్చిగడ్డి చిన్న మూట రూపాయినుంచి రూపాయి న్నర ధర పలుకుతోంది! తిండి గింజలే దొరక్కుంటే ఇక గుర్రానికి వులవలెలా వస్తాయి రోజూ!

వెంకటాద్రిని ఇవేమీ కదిలించలేదు!

"వూరికే బాధపడకే శేషూ! రోజులన్నీ ఇట్లాగే వుండవులే! మంచి బాడుగలే వస్తాయిలే! గుర్రానికీ మనకూ కావలసినంత దాణా దొరుకుతుందిలే!" అన్నాడు అనంతమైన విశ్వాసంతో!

కానీ.... వెంకటాద్రికి (ఆత్మవిశ్వాసం ఒక్కటీ అన్నం పెట్టడంలేదు! రిక్షాల జోరు హెచ్చింది

"ముప్పావలా ఇస్తాను .... వస్తేరా! రాకుంటే వెళ్ళు .. ముప్పావలా పారేస్తే ....మూడు మైళ్ళు వెళ్ళొచ్చు రిక్షాలో!" అంటూ....తను ఆలోచించి ఏ సంగతీ చెప్పేలోగానే, రిక్షాలో కూర్చొని వెళ్ళి పోతున్నారు జనం.

"బాబూ! రిక్షాలో కూర్చోండి! ఎట్లాంటి చుక్క కావాలంటే అట్లాంటి చుక్కకాడికి తీసుకపోతా! ఏ లాడ్జికి కావాలంటే ఆ లాడ్జికి తీసుకపోతా!" అంటూ గుసగుసలుగా చెప్పి, గాలం వేస్తున్నారు కొందరు రిక్షావాళ్లు! ఏకంగా కన్నెపిల్లల్నీ పడుచు కుర్రాళ్ళనీ ....రిక్షాలలో కూర్చోపెట్టుక, తెర అడ్డంవేసి .... ఏ ఏకాంత ప్రదేశాలకో తరలిస్తుండటం పరిపాటయి పోయింది!

"బండి కడతావా అబ్బీ!" అన్నా రో పడుచు జంట....

"కడతాను బాబూ! ఎక్కడి కెళాలి?" అన్నాడు వెంకటాద్రి.

కుర్రాడు కొంటెగా ఆ అమ్మాయికేసి చూసి కన్నుగొట్టాడు.అమ్మాయి....అంగీకార సూచకంగా చిరునవ్వు నవ్వి వూరుకుంది! ఆ అమ్మాయి....కాలేజిలో చదువుతున్న పిల్ల! పెళ్లిగాని పిల్ల....! వెంక

టాద్రిగుండె క్షణకాలం గుబగుబలాడింది. ''దర్గామిట్ట దాటి....'' ఆ కుర్రా డేదో చెప్పబోయాడు....

''నాకు వేరే బేరముందిలే బాబూ. ఇట్లాంటి పనులకు నే రాను!'' అనేశాడు వెంకటాద్రి రోషంగా.

ఆ కుర్రాడు క్షణకాలం ముఖంగంటు పెట్టుకున్నాడు. ఆ అమ్మాయీ ముఖం చిట్లించుకుంది.

''ఆ ఏడుపేదో ముందే ఏడవలేక పోయావ్? ఓ పావలా ఎక్కువ పారెయ్యమంటే పారెయ్యనూ?'' అన్నాడు కుర్రాడు ధుమధుమలాడుతూ!

''పావలా కాదు.... పది రూపాయలు పారేసినా రాను....ఇట్లాంటి యవ్వార్లాలకు కాదు నా బండీ - గుర్రం ... నేనూ!'' తెగేసి చెప్పాడు వెంకటాద్రి.

''అతగాడితో మనకేమిటి ... ఓ రిక్షా చూడు వెడదాం!'' అని కాబోలు ...ఇంగ్లీషులో అంటోం దా పిల్ల.

''తెగపడ్డ ఆడపిల్ల! బాఫ్‌రే! కాలం! చూడరా ముత్యాలూ!' అన్నాడు వెంకటాద్రి.

చూస్తుండగానే ఆ ఇద్దరూ ఓ రిక్షాలో కూర్చుని ....తెరఅడ్డువేసుకుని తుర్రున ఎగిరిపోయారు.

## న్యూ టేస్ట్

ఒక కంపెనీ పండ్లపొడిని విరివిగా తయారుచేయటం ప్రారంభించింది. కానీ ప్రజాదరణ పొందటం లేదది. కూర్పులు చేర్పులు చేసేందుకు కొంతమంది సలహాదారులను పిలిచారు. ఎవరు ఎన్ని చెప్పినా యజమానికి నచ్చటం లేదు. చివరి వ్యక్తితో సంప్రదింపలు జరుగుతున్నాయి. "ఎంత ఘటగా వున్నా యింకా ఘాటుగా కావాలంటున్నారు కస్టమర్స్" యజమాని నసిగాడు.

ఆ వచ్చిన వ్యక్తి కాస్త ఆలోచించి ముసిముసిగా నవ్వుతూ. "మిరపగింజలు మెత్తగా మిషనులో పొడి చేయించి పళ్ళ పోడిలో కలిపితే ప్రజలు గమనించలేరు. పండ్లపొడి విరివిగా అమ్ముడు పోతుంది.'' అన్నాడు.

యజమాని కాస్త చికాకుగా చూచి. ''ఆ పని యిదివరకే చేశామయ్యా. ఆయినా మన తెలుగు వాళ్ళకు ఆ ఘాటు చాలటం లేదట''అన్నాడు.

—అనుపమ.

"ఇది మరీ బావుంది। మన కెందుకు ఎవరెట్లాంటి వాళ్ళయితే? ఎంతకోఅంతకు బాడుగకు పోవాలిగానీ. ఇట్లాంటి నియమాలు మనకు కూడు పెడతాయా?" అంటూ తిట్టిపోసింది శేషమ్మ ఆ సంగతి చెబితే. మెచ్చుకుంటుందని ఆశించిన వెంకటాద్రిపై।

అసలీమధ్య శేషమ్మ కూడా మారిపోయింది। ఒకప్పుడు గర్వకారణంగా వున్న గుర్రమూ, బండీ గుదిబండల్లా వున్నాయి ఆమెకు! తమ వీధిలో మువ్వాతికమంది మగవాళ్ళు....తలకో రిక్షా బాడుగకు తెచ్చుకున్నారు.

అప్పుడప్పుడు కొందరు మగవాళ్లు; సరదాగా, తమ పెళ్లాళ్న రిక్షాల్లో సినిమాకీ షికారుకీ తీసుకుపోతున్నారు కూడాను! రోజుకు మూడు నాలుగు రూపాయలు సంపాదించు కొస్తున్నారట బాడుగపోను! ఇదెంత హాయిగా వుంది! ఆ సైకిలుకు పచ్చిగడ్డి పనిలేదు.... కుడితి నీళ్ళక్కర్లేదు వులవలు అవసరంలేదు। ఎప్పుడైనా కాస్తంత ఆయిలూ, గాలీ చాలు! చెయినో ఏదో చెడితే వేసుకోవటం! శేషమ్మ ఆలోచనలు సరికొత్త దారిలో పడ్డాయి।

ఈ ముసలగుర్రాన్నీ బండినీ అమ్మిపారేసి, తామూ ఓ రిక్షా తీసుకుంటే తనకీ గడ్డి తెచ్చే కష్టం తప్పుతుంది.... తన మొగుడు సరివారిలో గొప్పగా రిక్షా తొక్కుతాడు. తన పిల్లలకూ తిన్నంత తిండి! పైపెచ్చు తను సొంత రిక్షావాడి భార్య!

మొన్నను ఆ సుబ్బులు మొగుడు.... ఎవరో ఓ మా రాజు నీ....ఓ అమ్మాయినీ... అట్లా నాలుగు ఫర్లాంగులు తీసికెళ్ళి వదిలేసి వస్తే....పది రూపాయలు ఇనామిచ్చారట మహానుభావుడు. అసలు రాత్రిళ్లు "ఖాతా"ల లోనే ఎక్కువ ముట్టుతుందట సుబ్బులు మొగుడికి! ఈ మధ్య దానికో బంగారు గొలుసు కూడా చేయించాడు వాడు.

తన మావ పిచ్చిగానీ తనొక్కడూ మడికట్టు క్కూర్చుంటే కాలంఆగుతుందా? అందరూ "అట్లాంటి"బాడుగల్లో కావలసినంత సంపాదించు కుంటున్నారు. ఇంకా ఈ కూటికి గుడ్డకు తడుముకునే బ్రతుకెందుకు? రిక్షా కొని తీరాల్సిందే? ఈ పాడు బండినీ, గుర్రాన్నీ అమ్మిపారేయాల్సిందే!

శేషమ్మ ఆలోచనలు, ఆమెతలలో అగక వాగ్రూపంతో బయట పడటానికి ఎక్కువ రోజులు పట్టలేదు.... వెంకటాద్రికి బయట ఎంత చికాకుగా వుందో, ఇంట్లోనూ అంతటి అశాంతి తయారయ్యింది. .... ముత్యాలు రోజురోజుకూ నీరసించి పోతోంది బాడుగల్లేవు! సరైన పోషణ లేదు. ఇంట్లో శేషమ్మ ఆదరణ అసలేలేదు. పిల్లల దగ్గర్నుంచి 'రిక్షా,రిక్షా'

అన్నపాటే. బండిమోటుగా బండలా కనిపిస్తోంది, అందరికీ.

''అవికాదే శేషూ! మీ ఆయన కేం తిక్కా? అందరూ రిక్షా మీద అంత లేసి సంపాదిస్తూంటే, ఈ బండి మెడకేసుక్కొట్టు కూర్చున్నాడు!'' అంటూ వదినెలూ, అన్నలూ, ఇరుగు పొరుగులూ, చివరకూ తండ్రీ కూడా ఎగతాళి చెయ్యటంతో శేషమ్మకు తిక్కరేగి పోయింది.

పదిరోజుల క్రితం తెగేసి చెప్పింది.

''నాకు నగలూ నాణ్యాలూ చేయించకుంటే మానె; నాకూ పిల్లలకూ ఇంత కూడయినా పెట్టకుంటే, ఏదో చూసుకోవాలి మేము? ఇక గుర్రప్పనుగే వుండాలో, నేనే వుండాలో తేల్చుకో! తలక్కాస్త ''ఎండ్రిన్'' పోసి నేనూ పోసుకుంటా'' అనేసింది.

వెంకటాద్రికి వూపిరి సలప లేదు.

అతగాడి మౌనం అలుసుగా తీసుకొని శేషమ్మ, ఓ ''దలారి''ని పట్టుకొని బేరం కూడా కుదిర్చేసింది బండికీ, గుఱ్ఱానికీ. అంతేకాదు ఓ కొత్త రిక్షా కొని పెట్టమని కూడా చెప్పేసింది. అతగాడు రిక్షా ఖరీదు కుదుర్చుకొని వచ్చాడు కూడా!

* * *

''అన్నానికి రా!''

దగ్గర్లో వినిపించిన శేషమ్మ గొంతుకతో త్రుళ్లిపడి కూచున్నాడు వెంకటాద్రి.

గతమంతా చెదిరి పోయింది, శేషమ్మ భూతకిలా ఎదుట నిల్చుని వుంది.

''పదవస్తున్నా.''

తెల్లవార్లూ నిద్ర పట్టలేదు వెంకటాద్రికి....

తెల్లగా తెల్లారింది. బండినీ గుఱ్ఱాన్నీ కొన్న మనిషి., ఎవరో మోతుబరి రైతుకు పాలేరు ..వచ్చి కూర్చున్నాడు తోలుకు పోవటానికి ...

వాకిట్లో కొత్త రిక్షా వచ్చి నిలచివుంది· మధ్య వర్తి పోలయ్యా కూడా నిల్చుని వున్నాడు.

"వుండు పోలన్నా! శకునవేళవచ్చావు ఆ బండీ గుఱ్ఱం ఒప్పాదాటనీ ఆ డబ్బు. నీ చేతిలో ఇట్లా వేస్తాను.... ఇంట్లో అలే పెట్టామంటే అదికాస్తా ఖర్చై పోతుంది!" అంటోంది శేషమ్మ సంతోషంగా....

వెంకటాద్రి వులక లేదు పలకలేదు.

బండికి గుఱ్ఱాన్ని కట్టిచ్చాడు చెలకోల ఆ పాలేరు చేతికిచ్చాడు ... ఒక్కసారి గుఱ్ఱాని ఆప్యాయంగా నిమిరాడు

"వెళ్లు ముత్యాలూ! వెళ్లు మనిద్దరి నీతీ వేగమూ ఇప్పుడెవరికీ అక్కర్లేదు. నా దగ్గరున్నా ఇక నీకు దిక్కులేని ఛావే! రిక్షా మోజులో వున్న శేషు ఇక నిన్ను వుట్టినే చంపుతుంది....

అదుగో అక్కడుంది చూడూ ఆరిక్షా దాని కొత్త చక్రాలూ, ఇనుప కమ్ములూ ఎంత తళతళ మెరుస్తున్నాయో, ఆ మెరుపు నాలుగు రోజులే! ఆ తర్వాత అవి తుప్పు పడతాయి! అయినా ఆ తుప్పు పట్టిన చక్రాలే... ఎంత చక్రమో తిప్పు తున్నాయి!

నేనూ అవి తొక్కటం నేర్చుకోవాలి. ఆ తెరలు దించాలి· టౌన్‌కు దూరంగా, చాటు మాటుగా, ఆపుకోవాలి.... గొందుల్లో సందుల్లో దూరాలి.... నీతినీ, అవి నీతినీ కలగా పులగంగా కలిపి తొక్కాలి ఒద్దొద్దు నువ్వు ఇలాటివి చూడలేవు నీకు అలవాటులేదు. మేం మనుషులం అలాటిది మాకు స్వతహాగాకున్నా, కాలం నేర్పుతుంది, వెళ్లువెళ్లు ఆ రైతెవరో బాగా చూసుకొంటే, హాయిగా బ్రతుకుతావు నిన్ను ఏసేద్యగాళ్ళకో వప్పజెప్పి స్వారికి మాత్రం తయారైతే ఇక నీ ఖర్మ .. వెళ్లు....వెళ్లు ఇక ఈ కాలంలో మరెప్పుడూ గుర్రంగా పుట్టకు ఏ మిషను గానో పుట్టు. గౌరవం వుంటుంది.... అసలు మనమే ఈ కాలానికి సరిపోలేమేమో! అదుగో! నా పెద్ద కొడుకు చూడు ఆ రిక్షాని చూస్తూ ఎంతగా సంబర పడి పోతున్నాడో! అవును మరి కాలం మారింది.... ఈ కాలనికి అదే తగిందేమో!....వెళ్ళు....వెళ్ళు! ' వెంకటాద్రి మూగభాష ముత్యాలకు అర్థమయింది. తల విదిల్చింది. బండి . దిలిపోయింది. శేషమ్మ సైకిల్ రిక్షాకు ఎఱ్ఱనీళ్ళు తిప్పి పోస్తోంది సంబరంగా.

"రిక్షావాళ్ళు కూడా వస్తురంటారని తెలిసిన రోజు, ఈ ఎఱ్ఱనీళ్ళు మరెవరికి తిప్పుతావే శేషూ!" అనుకున్నాడు వెంకటాద్రి అతగాడికి అలవిగాని బాధతోబాటు ఆపుకోలేని నవ్వూ ముంచుకొచ్చింది. •

# సిమెంటు తయారీ దేశాభివృద్ధి చేస్తాము!



ఆంధ్రప్రదేశ్‌లో ఉధృతమైన కృష్ణానదిపై 302 అడుగుల ఎత్తుతో నాగార్జునసాగర్ ఆనకట్ట కట్టబడియున్నది. 22 లక్షల ఎకరముల బంజరు భూములను సాగుచేయుటయే ఈ ఆనకట్ట నిర్మాణ లక్ష్యము! ఇది నిస్సందేహముగ భారతదేశ పురోభివృద్ధియొక్క ముఖ్య ఘనత

బ్రహ్మాండమైన నాగార్జునసాగర్ ఆనకట్ట నిర్మాణమునకు శాశ్వతమైన స్థిరత్వముకొరకు, ప్రత్యేకంగా కె.సి.పి. & దుర్గా సిమెంటు మాత్రమే ఉపయోగించబడినది

కె.సి.పి. & దుర్గా సిమెంటులో మీకు వలసిన గుణములు కలిగియున్నవి. అంతేకాదు, ఇది గట్టిపడుట, బీటలు వారకుండుట, త్వరగ గడ్డకట్టుట, చూడ చక్కని మేలిరకపు చక్కదనమును కన్పింపజేయుట, మొదలగు గుణములను అత్యంత అధిక మోతాదులలో గల్గియున్నవి

అంతేకాదు ఈ కె.సి.పి. దుర్గా సిమెంటుయొక్క ప్రత్యేకత దీని లేత రంగు ఏ విధమైన కల్తీ జరగకుండ కాపాడుతుంది

**కె.సి.పి. & దుర్గా సిమెంటు**

తయారుచేయువారు.

**దీ ఆంధ్రా సిమెంటు కంపెనీ లిమిటెడ్.**

సేల్స్ ఆఫీసు—విజయవాడ



**దీ కె.సి.పి. లిమిటెడ్,**

38, మౌంటు రోడ్, మద్రాసు-6.



SISTA'S-KCP-197 TEL-A




"మీరు సాయంత్రం తీరికగానే వుంటారుగా?" అడిగాడు ప్రభాకర్ సుభాషిణి ప్రక్కన నడుస్తూ.

"ఎందుకు?" అడిగింది సుభాషిణి.

"మాట్లాడాలి."

"తీరికగానే వుంటాను."

"ఇంట్లోనే వుంటారు గదా?"

"మీరు వుండమంటే వుంటాను."

"థాంక్స్. సాయంత్రం ఆఫీసు అయిపోగానే మీ ఇంటికి

వస్తాను.''

''ముఖ్యమయిన సంగతులా?'' అడిగింది సుభాషిణి నవ్వుతూ.

నవ్వుతున్న సుభాషిణి వంక కొన్ని క్షణాలు రెప్ప వాల్చకుండా చూశాడు ప్రభాకర్.

''అవును. ఓ ముఖ్యమైన సంగతి!'' అన్నాడు.

''ఏమిటంత ముఖ్యమైన సంగతి?'' అడిగింది సుభాషిణి.

చిన్నగా నవ్వాడు ప్రభాకర్.

ఏళ్లు నిండిన తనని ఎందుకు ప్రేమిస్తాడు? ఎదురింటి అమ్మాయిలాంటి వాళ్ళని ప్రేమిస్తాడు. పందొమ్మిదేళ్ళ ఎదురింటి అమ్మాయికి.

మరింకేం మాట్లాడతాడు? బహుశ తమ పనిమనిషి సరిగ్గా వూడవటం లేదనో, తను నీళ్ళు పట్టుకునే సమయానికి అడ్డు వస్తున్నారనో-అలాంటివే ఏవో మాట్లాడతాడు.

బస్ స్టాప్‌లో బస్ సిద్ధంగా వుంది బస్‌లోకి ఎక్కగానే ప్రభాకర్ సంగతి మరిచిపోయింది సుభాషిణి.

---

**జీవిత గమ్యాన్ని యిరువురూ సమంగా పంచుకొని నిర్వహించాలను కుంటారు ఆదర్శదంపతులు.**
**కాని దైవమే ఆ నిర్ణయం చేస్తే?!**

---

''ఓపిక పట్టండి. సాయంత్రం తెలుస్తుంది గా?''

ఇద్దరూ సందు చివర విడిపోయారు.

సుభాషిణి నడుస్తూ ఆలోచిస్తోంది సాయంత్రం ఏం మాట్లాడతాడు ప్రభాకర్? అంత ముఖ్యమైయిన విషయం తనతో మాట్లాడేందుకు ఏం వుంది? ...తనతో [illegible] పనివాళ్ళు కూడా ఎక్కువ లేదు పక్క పక్కనే వుంటున్నందు వల్ల ఎప్పుడయినా కనపడితే పలకరింపుగా నవ్వుతాడు. అంతే! ప్రేమిస్తున్నానంటాడా? చిన్నగా నవ్వుకుంది. ముప్పై

ఆఫీసులో పని చేస్తున్నా దృష్టి పని మీద లేదు ప్రభాకర్‌కి. ఓచర్స్ మీద జర్నల్ ఎంట్రీస్ అన్నీ తప్పు రాస్తున్నాడు. ఎకౌంటెంట్ విసుక్కున్నాడు.

''ఒంట్లో బాగా లేదా మీకు? ఎప్పుడూ తప్పులు చెయ్యని మీరు పెద్ద తప్పులే చేస్తున్నారు.'' అడిగాడు ప్రభాకర్‌ని.

''తలనొప్పిగా వుంది కొద్దిగా!'' జవాబు చెప్పాడు.

''అయితే కేంటీన్‌కి వెళ్ళి రండి ఏదయినా మాత్ర వేసుకోండి.''

టీ త్రాగుతూ ఆలోచిస్తున్నాడు

ప్రభాకర్. సాయింత్రం తను అడిగేదానికి ఒప్పుకుంటుందా సుభాషిణి? కోపం వస్తుందా? సుభాషిణి కళ్ళలో మెదిలింది.

చాలా సేపు కేంటీన్‌లోనే కూర్చుండి పోయాడు రోజూలాగా పబ్లిక్ లైబ్రరీ దగ్గర ఆగకుండా, ఆఫీసు నుంచి సాయింత్రం తిన్నగా గదికి వెళ్ళిపోయాడు ప్రభాకర్.

తాళం తీస్తూంటే వినిపించింది వెనక నుంచి.

''ఇప్పుడే వచ్చారా ఆఫీస్‌నుంచి?''

వెనక్కి తిరిగి చూశాడు ప్రభాకర్.

సుభాషిణి! వాళ్ళింటి గుమ్మం ముందు నిలబడి వుంది.

''అవును,'' అన్నాడు నవ్వి.

''ఉదయం నాతో ఏదో మాట్లాడా లన్నారు?''

''అవును - గుర్తుంది. కాఫీ తాగి వస్తాను.''

''కాఫీ రెడీగా వుంది. మాతో తాగుదరు గాని.'' అన్నది సుభాషిణి.

'ఒక్క నిముషం. మొహం కడుక్కుని వచ్చేస్తాను.''

గది తాళం తెరచి, లోపలకి వెళ్ళి మొహం కడుక్కున్నాడు ప్రభాకర్. అద్దం ముందు నిలబడి జుట్టు దువ్వుకుని, ఇన్‌షర్ట్ సరి చేసుకున్నాడు.

టేబిల్ మీద, డిక్షనరీ కింద ఎగిరి పోకుండా పెట్టిన తెల్లకాగితం అందుకుని, అందులో క్రిందటి రోజు రాత్రి తను ఆలోచించి రాసుకున్న పాయింట్స్, మళ్ళీ ఓసారి చదువుకున్నాడు.

కాగితం మడిచి జేబులో వేసుకుని, గది తలుపు దగ్గరకి వేసి బయటకి వచ్చాడు.

సుభాషిణి ఇంకా గుమ్మం దగ్గరే నిలబడి వుంది. సుభాషిణి వెంట లోపలకి వెళ్ళాడు ప్రభాకర్.

''కూర్చో నాయనా! కులాసాగా వున్నావా?'' పలకరించింది సుభాషిణి తల్లి.

తల వూపి. పేము కుర్చీలో కూర్చున్నాడు ప్రభాకర్.

''ఇప్పుడే వస్తాను ''

లోపలకి వెళ్ళింది సుభాషిణి తల్లి వంట గదిలోకి,

సుభాషిణి వంక చూశాడు ప్రభాకర్. తన వంకే చూస్తోంది. సన్నగా-తెల్లగా వుంది. నల్లటి చీర జాకెట్‌లతో. అక్కడక్కడ కొంచెం నెరసిన జుట్టు, నుదుట పెద్ద కుంకుమ బొట్టు. తిలకం కాదు, సామాన్యంగా వుంటుంది.

''కూర్చోండి మీరు కూడా. నిలబడే వున్నారు'' అన్నాడు ప్రభాకర్,

ఎదురుగా స్టూల్ మీద కూర్చుంది సుభాషిణి.




"మీరు వుద్యోగం చేస్తున్నారను కుంటాను?" అడిగాడు ప్రభాకర్.

"అవును. కాన్వెంట్‌లో టీచర్‌గా." అని ఆగి, ప్రభాకర్ వంక చూసి అంది. "మీకు తెలుసుగా! నాన్నగారు లేరు నాకు. పన్నెండేళ్ళప్పుడే పోయారు. ప్రస్తుతం వుద్యోగం లేకపోతే గడవదు మాకు. ఆస్తులు ఏమీ లేవు. అన్నయ్యది పెద్ద వుద్యోగమే అయినా ఖర్చులు ఎక్కువ అన్నయ్యకి."

"మీ అన్నయ్య ఎక్కడ పని చేసేది?"

"చాలా దూరం. ఇండియన్ ఆయిల్ కార్పొరేషన్ గౌహతీలో!"

జేబులో వున్న తెల్ల కాగితం మీద రాసుకున్న పాయింట్స్‌కి ఇది కూడా కలపాలనుకున్నాడు ప్రభాకర్.

"ఏదో మాట్లాడాలన్నారు." అన్నది సుభాషిణి కాస్సేపాగి. గుండెలు గబగబా కొట్టుకుంటున్నాయి. తనని పెళ్ళి చేసుకుంటానంటాడా?

"మీ అమ్మగారు రానీండి. ఒకేసారి చెప్తాను."

"మీరు ఎక్కడ పనిచేస్తారు?" అడిగింది సుభాషిణి.

"ఓ ప్రయివేట్ కంపెనీలో ఆఫీ

స్టెంట్ ఎకౌంటెంటుగా." చెప్పాడు ప్రభాకర్.

చేతిలో కాఫీగ్లాసులతో వచ్చింది సుభాషిణి తల్లి.

"తీసుకో నాయనా. ఇంట్లో చేసిన కాఫీ బయట హోటల్‌లో చేసే కాఫీకన్నా బాగుంటుంది" అందించింది కాఫీగ్లాస్.

కాఫీగ్లాస్ అందుకుని, కొంచెం కాఫీ రుచిచూసి అన్నాడు ప్రభాకర్ నవ్వి.

"అవును కాఫీ చాలా బాగుంది."

సుభాషిణికి ఓ కాఫీగ్లాస్ అందిస్తూ అన్నది సుభాషిణి తల్లి. "త్వరలో నే ఎవరయినా మంచి అమ్మాయిని చూసి పెళ్ళి చేసుకోరాదూ? ఇంకా నీకు పెళ్ళి కాలే దనుకుంటాను."

"అవును. ఇంకా పెళ్ళికాలేదు నాకు. ఆ విషయం గురించే వచ్చాను" అన్నాడు ప్రభాకర్ కాఫీగ్లాసు పక్కన పెట్టి.

"పెళ్ళి కుదిరిందా మీకు?" అడిగింది సుభాషిణి.

"లేదు."

కొన్ని క్షణాల తరువాత గొంతు సర్దుకొని మొదలుపెట్టాడు ప్రభాకర్.

"రెండు సంవత్సరాల నుంచి అనుకుంటాను, మీ ప్రక్క వాటాలో వున్న గదిలో అద్దెకి వుంటున్నాను. నన్ను రోజూ చూస్తూనే వున్నారు మీరు. ఇన్నాళ్ళబట్టి నేను మంచివాడి ననేగా మీ అభిప్రాయం?"

"అయ్యో! ఎవరు కాదన్నారు?" అన్నది సుభాషిణి తల్లి గుమ్మం ప్రక్కన కూర్చుని.

సుభాషిణి ప్రభాకర్ మొహంవంకే చూస్తూంది. ఏం చెబుతున్నాడో ఊహించ డానికి ప్రయత్నిస్తూ.

"రెండునెలల నుంచి మీతో మాట్లాడదామనుకుంటున్నాను. కాని ఇప్పటిదాకా ఏం చెప్పలేదు నేను. మీకు అభ్యంతరం లేకపోతే మీ అమ్మాయి సుభాషిణిని పెళ్ళి చేసుకుందామనే నిశ్చయానికి వచ్చాను." అని వూపిరి పీల్చుకున్నాడు ప్రభాకర్.

తన చెవులని తనే నమ్మలేకపోయింది సుభాషిణి తల్లి కూతుళ్ళిద్దరూ ప్రభాకర్ వంక చూశారు ఆశ్చర్యంగా.

"నా గురించి చెప్పాలికదా మీకు. అమ్మా, నాన్న లేరు. చిన్నప్పటినుంచి పెద్దన్నయ్యదగ్గరే పెరిగాను. ఇప్పుడు పెద్దన్నయ్యకూడా లేడు. కాబట్టి నా వైపు నుంచి ఎట్టి అభ్యంతరం వుండదు. తరువాత, పెళ్ళికి కావల్సిన ముఖ్యార్హత. మంచి ఉద్యోగం ఉంది నాకు." అని సుభాషిణి కళ్ళలోకి చూశాడు ప్రభాకర్.

సుభాషిణి కళ్ళలో సంతోషం. కృతజ్ఞతాభావం కనపడుతున్నాయి స్పష్టంగా.

సుభాషిణి తల్లివంక చూసి అన్నాడు ప్రభాకర్.

"మీకు ఏలాంటి అభ్యంతరంవుంటుం దనుకోను. వయస్సు వచ్చిన కొద్దీ సుభాషిణికి తగిన పెళ్ళికొడుకు దొరకటం కష్టం. దొరికినా రెండవ పెళ్ళికొడుకు దొరుకుతాడు ఇంటినిండా పిల్లలతో. పెళ్ళి చేసుకుంటే కట్నం లభించే ఈ రోజుల్లో పెళ్ళిచేసుకోకుండా వుండే మగ వాళ్ళు తక్కువ.

రెండవది మొగదిక్కు లేకుండా మీ రిద్దరూ ఎన్నాళ్ళవి ఇలా వుంటారు?

మూడవది ఎక్కడో దూరానవున్న సుభాషిణి అన్నయ్య వచ్చి తగిన సంబంధంవెదికి సుభాషిణి పెళ్ళి ఎప్పుడు చేస్తాడు?

ప్రభాకర్ తనని పెళ్ళిచేసుకుందామను కుంటున్నాడనే సంగతి మనసులోకి ఇంక గానే సుభాషిణి లేచివెళ్ళి ప్రభాకర్ చేతులు పట్టుకొని తన సంతోషం తెలపా లనుకుంది. కాని, ప్రక్కనే తనతల్లి వుండటంతో స్టూల్‌మీదనుంచి కదలలేదు.

"నువ్వు చెప్పేంది నిజమేనా?" అడి గింది సుభాషిణి తల్లి ప్రభాకర్‌ను అను మానంగా.

చిన్నగా నవ్వాడు ప్రభాకర్.

"నిజంగానే. సుభాషిణిని, మీరు ఇష్ట పడితే వెంటనే పెళ్ళి చేసుకోడానికి సిద్ధ ముగా వున్నాను" అన్నాడు.

"అయితే మా కిష్టమే" అన్నదిసుభా షిణి తల్లి. "ముహూర్తం అదీ చూడ క్కరలేదు. మంచిరోజు చూసి, రిజిష్ట్రార్ ఆఫీసులో చేసుకుంటాము పెళ్ళి ముప్పై ఐదేళ్ళు నా కిప్పుడు. పెళ్ళికి ఇప్పుడు ఆట్టే ఆర్భాటం నా కిష్టంలేదు. ఎవరన్నా చూసినా నవ్వుతారు" అన్నాడు ప్రభాకర్.

సుభాషిణి, సుభాషిణితల్లి ఇద్దరూ ఏం మాట్లాడలేదు. అసలు ఏం మాట్లాడాలో తెలియలేదు. వాళ్ళిద్దరికి అనుకోని ఈ శుభవార్తవల్ల.

"ఇక వస్తాను. రేపు అన్నిసంగతులు మాట్లాడుకుందాం"

లేచాడు ప్రభాకర్.

"కాఫీ త్రాగకుండా వెళ్ళిపోతున్నావు నాయనా" ప్రభాకర్ పక్కనే వున్న సగంపైనే వున్న కాఫీగ్లాసువంక చూసి అన్నది సుభాషిణితల్లి.

"పర్వాలేదు, చల్లారిపోయింది. ఈ సారి వచ్చినప్పుడు తాగుతాను ఎలాగైనా" అన్నాడు ప్రభాకర్.

"అలాకాదు. వుండు వెచ్చబెట్టి తీసుకు వస్తాను."

కాఫీ గ్లాస్‌తో లోపలకి వెళ్ళింది సుభాషిణి తల్లి.

సుభాషిణి కనురెప్పలు పైకెత్తి ప్రభాకర్ వంక చూసింది.

నవ్వుతూ తన వంకే చూస్తున్నాడు ప్రభాకర్.

"చిన్నగా మీరు గదికేనా వెళ్ళేది?" అడిగింది సుభాషిణి.

"దేనికో?" అడిగాడు ప్రభాకర్.

"దయచేసి గదికే వెళ్ళండి. నేనూ వస్తాను. మీతో మాట్లాడాలి." అన్నది సుభాషిణి.

"సరే." అన్నాడు ప్రభాకర్.

పది నిమిషాల తర్వాత ప్రభాకర్ గది లోకి వెళ్ళింది సుభాషిణి. గది వంక పరీక్షగా చూసింది. బ్రహ్మచారి గదిలా లేదు. సామానంతా నీట్‌గా అమర్చబడి వుంది.

"కూర్చోండి." అన్నాడు ప్రభాకర్ బూట్ లేసుల ముడి విప్పుతూ.

కుర్చీలో కూర్చుంది సుభాషిణి. ఎదురుగా వున్న రౌండ్ టేబిల్ మీద చిన్న ప్లేట్‌లో బిస్కట్స్ వున్నాయి.

"తినండి. మీ కోసమే!" అన్నాడు ప్రభాకర్ సాక్స్ విప్పుతూ.

"బదులు తీర్చుకుంటున్నారా?" అడిగింది సుభాషిణి నవ్వుతూ.

ప్రభాకర్ నవ్వలేదు.

"చెప్పండి. నన్ను పెళ్ళి చేసుకోవడం ఇష్టం లేదా మీకు? ఎవరినయినా ప్రేమించారా?" అడిగాడు.

"ప్రేమా? ఈ వయసులోనా? ఎదురింటి అమ్మాయి వయసులో అయితే అనుకోవచ్చు!" నవ్వింది సుభాషిణి.

"పోనీ-ఎవరినయినా పెళ్ళి చేసుకుందా మనుకుంటున్నారా?" అడిగాడు బూట్స్ విప్పి.

"లేదు. మిమ్మల్ని పెళ్ళి చేసుకోడానికి నాకు పరిపూర్ణంగా ఇష్టమే!" అన్నది సుభాషిణి.

చిన్నగా నిట్టూర్చాడు ప్రభాకర్.

"బ్రతికించారు. మీకు ఇష్టం లేదేమో నని నేను భయపడ్డాను" అన్నాడు.

"నేను చెప్పే సంగతి శ్రద్ధగా వినండి. తర్వాత మీ అభిప్రాయం చెప్పండి నన్ను పెళ్ళి చేసుకునేదీ, లేనిదీ."

"అలాగే! చెప్పండి."

"అమ్మ నాకు పదిహేడేళ్ళ వయసులో అనుకుంటాను. మొదటి సారిగా పెళ్ళి ప్రయత్నాలు చేసింది. అన్నీ కుదిరాయి కాని చివరలో వాళ్ళే వద్దన్నారు-జాతకం చూసిన తర్వాత లేకపోతే అప్పుడే పెళ్ళి అయిపోయేది."

"ఎందుకని వద్దన్నారు?" అడిగాడు ప్రభాకర్.

"చెప్తాను. మళ్ళా పద్దెనిమిదో ఏట నుంచి ఇరవై రెండేళ్ళు వచ్చేదాకా చాలా మంది నన్ను చూసి ఒప్పుకున్నారు. కాని, నా జాతకం చూశాక ఇష్టం లేదనీ, మీ సంబంధం విరమించుకున్నామనీ కబురు పంపేవారు."

"ఎందుకు? ఏముంది మీ జాతకంలో?" అడిగాడు ప్రభాకర్.

కొన్ని క్షణాలు ప్రభాకర్ కళ్ళలోకి చూసింది సుభాషిణి.

"నా జాతకంలో, నేను విధవ అయ్యే గీత వుంది; పెళ్ళి అయిన తొందరలోనే!"

నవ్వలేక నవ్వాడు ప్రభాకర్.

"నిజంగా?" అడిగాడు.

"నిజమే! తర్వాత జాతకం లేదని అబద్ధం ఆడి కొన్ని ప్రయత్నాలు చేశారు కాని, ఏవీ కుదరలేదు. నాకూ క్రమంగా పెళ్ళి అంటే ఇష్టం, ఉత్సాహం చచ్చిపోయాయి. ఇంక ప్రయత్నాలు మానేశాం పూర్తిగా!"

## కో - ఆపరేషన్

● బహిరంగ సభలో ప్రసంగించబోతున్న ఓ మంత్రిగారు దీర్ఘంగా ఆలోచిస్తున్నారు. కారణ మేమిటని భార్య అడిగింది.

"నా ప్రసంగాన్ని ప్రజలంతా ప్రశాంతంగా కూర్చుని వింటే పాపులారిటీ రాదు," అన్నాడు.

"అయితే" అర్థం కాలేదామెకు

మంత్రిగారు పరిసరాలు పరికించి, "ఈలలూ, గోలలూ, అరటితొక్కు యింకా...." నసుగుతున్నారాయన.

భార్య తక్కున అందుకుంది. "అయితే ఓ పదిమంది కుర్రాళ్లను పంపుతాను లెండి, కానీ ఓ వెయ్యి రూపాయిలు యిచ్చుకోవాల్సి వుంటుంది నాకు" అంది

—అనుపమ

ప్రభాకర్ మాట్లాడలేదు. ఆలోచిస్తున్నాడు.

"మీకు ముందరే ఈ విషయం తెలియ చేయడం ధర్మం అని చెప్పాను. ఆలోచించుకుని రెండు మూడు రోజుల్లో చెప్పండి. మీరు మానుకున్నా అమ్మకి ఏదో సర్ది చెప్పగలను.'' అన్నది సుభాషిణి.

ప్రభాకర్ కొన్ని క్షణాలు సుభాషిణి వంక చూసి అన్నాడు ''దీంట్లో ఆలోచించుకోవాల్సింది ఏం లేదు.''

సుభాషిణి చేతిలో బిస్కట్ నోటి దగ్గరే ఆగిపోయింది. ఏం చెప్తాడా అని చూస్తోంది ఆతృతగా.

''పెళ్ళి చేసుకోడానికే నిశ్చయించుకున్నాను.'' అన్నాడు నవ్వుతూ.

"థాంక్స్.'' అన్నది సుభాషిణి.

"బహుశ దేవుడు మనిద్దరినీ కావాలని కలుపుతున్నాడనుకుంటాను '' అన్నాడు ప్రభాకర్.

టేబిల్ మీద వున్న ఫ్లాస్కు అందుకుని మూత తెరచి గ్లాసులో పోశాడు కాఫీ. గ్లాసు నిండుగా వచ్చింది కాఫీ. ప్రక్కనే వున్న గ్లాసు అందుకుని, సగం కాఫీ వంచాడు దాంట్లోకి.

''నాగరికతికిగెస్ట్సురారు అందుకనిఎప్పుడూ కాఫీ నాకు సరిపడ మాత్రమే తెప్పిస్తాను'' అన్నాడు ప్రభాకర్ రెండు చేతుల్లోవున్న గాజుగ్లాసులు ఒక దానికొకటి ఆనించి రెండుగ్లాసుల్లో వున్న కాఫీ సమానంగా వుందా లేదా అని చూస్తూ.

''ఇంక ఆబాధ అక్కరలేదు, మీకు'' అన్నది సుభాషిణి సన్నగా నవ్వి.

''గుడ్ రెండు గ్లాసుల్లో కాఫీ సమానంగా వుంది. నేను ఎక్కువ తీసు కోవడం లేదు, చూడండి.''

ఒక గ్లాసు అందించాడు సుభాషిణికి. నవ్వుతూ "మీరు త్రాగండి నేను ఇప్పుడే ఇంట్లో తాగానుగా'' అన్నది సుభాషిణి

"నేనూ తాగానుగా ఇంటి దగ్గర అదేం కుదరదు తీసుకోండి.''

కాఫీ త్రాగుతూంటే అన్నాడు ప్రభాకర్ ''ఈరోజునుంచి అన్నీ ఫిఫ్టీ ఫిఫ్టీ.''

మర్నాడు సుభాషిణి తల్లి అన్నది. ప్రభాకర్‌తో వాళ్ళ ఇంట్లో.

"సుభాషిణి మీకు అన్ని సంగతులూ చెప్పిందిట అయినా మీరు ఒప్పున్నారు పెళ్ళికి.''

ఆ ముసలావిడ మొహంలో సంతోషం చూసి నవ్వుకున్నాడు ప్రభాకర్

"అవును బహుశ దేముడు మమ్మల్ని ద్దర్నీ ఏర్చి కూర్చి కలిపి వుంటాడు.'' అన్నాడు.

''ఏం?'' అడిగింది సుభాషిణి తల్లి. ఎందుకో చెప్పలేదు ప్రభాకర్.



అమ్మా....అమ్మా....దుశ్యంతుడిక్కడే....యిక్కడే....!

"ఎల్లుండి మంచి రోజు రిజిష్టర్ ఆఫీస్‌కి వెళ్ళి పెళ్ళి చేసుకుంటాం బాగా తెలిసిన ఓ నలుగురయిదుగురినే పిలుద్దాం సుభాషిణిని ఓ పదిరోజులు శెలవు పెట్టమన్నాను. బెంగుళూరు, మైసూరు, వూటీ తిరిగివస్తాము ఇద్దరము. మీకు సుభాషిణి చెప్పివుంటుం దనుకుంటాను.

"చెప్పింది. చాలా సంతోషం."

"సుభాషిణిని తిరిగి రాగానే ఉద్యోగం మానేయమని చెప్పాను. ఇంటిదగ్గర మీకు తోడుగా వుంటుంది. ఇప్పుడు వుద్యోగం లేకపోతే గడవదనే బాధ లేదుగా."

ప్రక్క గదిలో కూర్చుని ఇద్దరి సంభాషణ వింటున్న సుభాషిణి ఆలోచిస్తోంది. ప్రభాకర్‌కి ఏదయినా లోపంవుందా? తన సంగతి తెలిసి, తనని పెళ్ళిచేసుకోడానికి ఎందుకు ఒప్పుకుంటున్నాడు? ముప్పై ఐదుఏళ్ళు వచ్చినా ఇంతవరకూ ప్రభాకర్ ఎందుకు పెళ్ళిచేసుకోలేదు? తనని మోసం చెయ్యటం లేదుకదా?

రెండురోజుల తర్వాత సుభాషిణీ, ప్రభాకర్ రిజిష్టర్ మేరేజి చేసుకున్నారు. సుభాషిణికి పరిచయింవున్న ఒకతను ప్రభాకర్ స్నేహితుడు సాక్షి సంతకాలు చేశారు.

పూలదండలతో వున్న వాళ్ళిద్దరూ తనకి నమస్కరిస్తూంటే మనసారా దీవించింది సుభాషిణి తల్లి.

''జాగ్రత్తగా వెళ్ళిరండి.''

నూతన దంపతులనిద్దర్ని రైలు ఎక్కించడానికి వచ్చింది సుభాషిణి తల్లి రైల్వే స్టేషన్‌కి.

''వారంరోజుల్లో తిరిగి వచ్చేస్తాము. ఆయన గది ఖాళీ చేస్తారు. మన ఇల్లు వుండగా ఇంక అది దండగ.'' అన్నది సుభాషిణి తల్లితో.

ప్రభాకర్ జేబులోంచి తన గది తాళం చెవులు తీసి ఇచ్చాడు సుభాషిణి తల్లికి.

''మర్చిపోయాను. నా గదిలో సామానంతా మీ ఇంటికి మార్పించండి.'' చెప్పాడు.

రైలు కదిలింది. పావుగంట తర్వాత సుభాషిణీ తల్లి ఇద్దరూ కనపడేంతవరకూ చెయ్యి ఊపుతూనేవుంది.

* * *

రైలు రెండుస్టేషన్‌లు దాటిన తర్వాత సుభాషిణి భర్తని.

''పెళ్ళయిన తర్వాత చెపుతానన్నారు నాకు, నన్ను పెళ్ళిచేసుకోడానికి కారణం, మనకి పెళ్ళయిందిగా ఇప్పుడు చెప్పండి.''

''ఇప్పుడే చెప్పాలా? తిరిగి వచ్చేటప్పుడు చెపుతాను గుర్తుచెయ్యి'' అన్నాడు ప్రభాకర్.

''వూహూం ఇప్పుడే చెప్పాలి.'' అన్నది సుభాషిణి.

''ప్లజంట్ రీజన్ కాదు. అంత ముఖ్యమైన విషయం కూడా కాదు.''

''ఫర్వాలేదు చెప్పండి.''

వేగంగా కదిలిపోతున్న చెట్లవంకా. టెలిగ్రాఫ్ స్థంభాలవంక. కొండలవంక చూశాడు ప్రభాకర్ కొంతసేపు పరుగెత్తుతున్న రైలు కిటికీలోంచి.

''మనిషి జీవితం శాశ్వతం కాదు.'' అన్నాడు.

''అసలు విషయం చెప్పక ఫిలాసఫీలోకి దిగారు'' అన్నది సుభాషిణి నవ్వుతూ.

* * *

సంతకం పెట్టి టెలిగ్రాం తీసుకుంది సుభాషిణి తల్లి. టెలిగ్రాం చించేసి కవరు లోంచి తీసింది కాని ఏమీ అర్థంకాలేదు. ఎర్రటి కాగితంమీద, ఇంగ్లీషులో టైపు చేయబడివున్న కాగితం అంటించి వుంది.

''టెలిగ్రాం తీసుకొని, తలుపుబయట గొళ్ళెంపెట్టి, ప్రక్క వాటాలో వసారాలో పడకకుర్చీలో పడుకుని. పేపరు చదువుకుంటున్న ముసలాయన దగ్గరికి వెళ్ళింది సుభాషిణి తల్లి.

''కొంచెం చదివిచెప్పండి ఏం వుందో ఇందులో?'' టెలిగ్రాం అందించింది ఆయనకి.

ముసలాయన పేపరుమడిచి. టెలిగ్రాం అందుకొని దాంట్లోని నాలుగు మాటలు చదివాడు.

నిశ్శబ్దంగా ఉన్న ఆయన్ని అడిగింది సుభాషిణి తల్లి అనుమానంగా.

"ఎవరి దగ్గరనుంచి?"

"మీ అమ్మాయి, అల్లుడు బెంగుళూరు వెళ్ళారా?" అడిగాడు ఆయన.

"అవును. నాలుగు రోజులయింది. ఇప్పుడు టెలిగ్రాం ఇచ్చారా క్షేమంగా ఉన్నట్లు?"

చిన్నగా నవ్వింది సుభాషిణి తల్లి.

"బెంగుళూరు టూరిస్టు శాఖవాళ్ళు ఇచ్చారు ఈ టెలిగ్రాం మీ అమ్మాయి, అల్లుడు ఇవ్వలేదు.

"ఏమిటి సంగతి?"

"అధైర్య పడకండి! ఇద్దరూ యివాళ వుదయం గవర్నమెంట్ హాస్పిటల్‌లో పోయారు."

"ఎవరిద్దరూ?"

"మీ అమ్మాయి, అల్లుడు."

ఆ ముసలావిడకి ఆయన చెప్పే దేమిటో వెంటనే మనసులోకి ఎక్కలేదు. అలాగే తెల్లబోయి చూస్తూండిపోయింది.

"మీ అమ్మాయి, అల్లుడు ఎక్కి వెళు తున్న టాక్సీకి ఏక్సిడెంట్ అయింది.... ఇద్దరూ చనిపోయారు. టూరిస్ట్ డిపార్ట్ మెంట్ వాళ్ళ దగ్గర నుంచి తీసుకున్నారు వాళ్ళు ఆ టాక్సీ. కాబట్టి వాళ్ళు టెలిగ్రాం ఇచ్చినట్టున్నారు."

సుభాషిణి తల్లి కళ్ళలోంచి నీళ్లు కారుతున్నాయి. ఇప్పుడు ఆ ముసలాయన చెప్పిన మాటలు మనసులోకి ఎక్కుతున్నాయి.

''అధైర్య పడకండి!''

ఆవిడ బిగ్గరగా ఏడవడం గమనించి, ఆ ముసలాయన యింట్లో పని చేసు కుంటున్న భార్యకి వినపడేలా గట్టిగా అరిచాడు.

''ఒపేవ్! త్వరగా ఇలా రా!''

* * *

మర్నాడు మధ్యాహ్నం వరకు ఏడుస్తూనే వుంది సుభాషిణి తల్లి. ఎవరు ఎంత బలవంతం చేసినా ఒక్క మెతుకయినా ముట్టలేదు ఆవిడ. ఆవిడకి తోడుగా ఓ పదిహేడేళ్ళ అబ్బాయిని కూర్చో పెట్టారు.

మధ్యాహ్నం పోస్టులో వచ్చింది చిన్న పార్సెల్. తోడుగా వున్నతను సంతకం పెట్టి, పార్సెల్ తీసుకుని విప్పాడు. డైరీ వుంది లోపల - ప్రభాకర్ డైరీ.... ప్రభాకర్, సుభాషిణి వుండే హోటల్ వాళ్ళు పంపారు.

పేజీలు తిప్పి చూసి, ఒక పేజీ దగ్గర ఆగిపోయాడు. ఒక పేజీ దగ్గర ఆగి పోయాడు అతను. పూర్తిగా చదివాడు ఆ పేజీలో రాసి వున్న సంగతులు.

''ఇది వినండి. మీకు తెలుసా?''

బిగ్గరగా చదివాడు అతను, సుభాషిణి తల్లి వినేటట్లుగా

''ఇవాళ సుభాషిణిని పెళ్ళి చేసుకోమని అడిగాను. ఇష్ట పడింది. కాని, తన జాతకంలో వైధవ్యం రాసి వుందని చెప్పింది సుభాషిణి. అయినా ఒప్పుకున్నాను.

ఇన్నాళ్ళూ నాకు ఏ కారణం వల్ల పెళ్ళి కాలేదో సుభాషిణికి అదే కారణం చేత పెళ్ళి కాలేదని తెలుసుకున్నాను ఇవాళ. మా ఇద్దరి జాతకాలు ఒకటే! కాబట్టే పెళ్ళికి ఒప్పుకున్నాను.

మేం ఇద్దరం ఇలా ఒంటరిగా, పెళ్ళి చేసుకోకుండా బ్రతికే కంటే, పెళ్ళి చేసుకోవటమే మంచిది. నాకూ జాతకంలో రాసి పెట్టి వుంది వైధవ్యం - అదే భార్యా వియోగం. మా ఇద్దరి జాతక ప్రభావాలు ఒకటి అవడంవల్ల ఇద్దరం బ్రతకవచ్చు. రెండు దోషాలు కొట్టుకుపోయి.... లేదా కలిసే చస్తాం.''

'ఈ రోజు నుంచి అన్నీ ఫిఫ్టీ-ఫిఫ్టీ అన్నారు ఆయన....' అన్న కూతురు మాటలు గుర్తుకు వచ్చాయి సుభాషిణి తల్లికి.

'బహుశ దేముడు మమ్మల్నిద్దర్నీ ఏర్చి కూర్చి కలిపి వుంటాడు' అన్న ప్రభాకర్ మాటలు గుర్తుకు వచ్చాయి.

## కుటుంబము అంతటికి

# ఫాస్ఫోమిన్

## వల్ల ఆరోగ్యము కలుగును




ఫాస్ఫోమిన్‌లో విటమిను బి కాంప్లెక్సు మరియు మల్టిపుల్ గ్లిసరోఫాస్ఫేట్లు ఉండుట వలన అది మీ కుటుంబమును బలముగా, చురుకుగా మరియు ఆరోగ్యముగా ఉంచుతుంది. మీయింట్లో శక్తినిచ్చే టానిక్ అగు ఫాస్ఫోమిన్ ఉంటే అలసట మరియు నీరసము అనే మాట ఉండదు. ఫాస్ఫోమిన్ చురుకుదనమును తిరిగి యిస్తుంది, ఆకలిని అధికము చేస్తుంది. శక్తిని పెంపొందిస్తుంది, దేహములో రోగనిరోధక శక్తిని కలిగిస్తుంది. ఫాస్ఫోమిన్‌తో మీ కుటుంబములో అందరూ ఆరోగ్యముగా ఉంటారు.



ఫాస్ఫోమిన్ —
ఆకుపచ్చని పండ్ల రుచిగల
విటమిన్ టానిక్



Shilpi-HPMA-31A/71 Tel.

# పెద్దకధ:



(గత సంచిక తరువాయి)

అంతా ఒక్కసారి గోలగా, మోటుగా అరిచారు. "తెచ్చిన బియ్యం వెనక్కి తీసుకపోతావేం, తల్లి?" "ఆకప్పును వది లేయండి ముందు" ఆజ్ఞాపూర్వకంగా అంది సావిత్రి నిర్మలమైన మనసుతో భగవంతునికి మొర పెట్టుకుంటే వర్ష ధారకురుస్తుందిగాని ఓ జీవిని హింస పెడితే వర్షంరాదు. పోలమ్మా ముందు దాన్ని వదిలెయ్యండి. మరోసావు బియ్యం తెచ్చి పెడతాగాని."

"ఏవో మా మూఢ నమ్మకాలు . ."

పొలం నుండి వస్తూ అడిగాడు హర నాథ్ "ఏమిటది"

"కనబడ్డం లేదూ?" అంది సావిత్రి

ఈ పల్లెటూళ్ళో చిన్నప్పటి నుండి ఇలాంటి తతంగాలు చూస్తూనే ఉన్నాడు కాబట్టి ఆతడికి ప్రత్యేకంగా కనిపించలేదు

ఆ దృశ్యం "ఏమిటీ" తిరిగి అన్నాడు.

"కప్పను కట్టి తెచ్చినామని అమ్మ కోపం చేస్తుంది." పాపమ్మ చెప్పింది కొంచెం బెదురుతూ ఈ దొర కూడా ఆ అమ్మకు తోడై చీవాట్లు పెడతాదేమోనని.

"బియ్యం పెట్టేసి తొందరగా పంపెయ్యి సావిత్రీ! ఇలాంటివన్నీ ఇక్కడ మామూలేఅన్నింటాతలదూర్చి సంస్కరించాలంటే తల కుదుళ్ళు కదిలిపోతాయి."

"మీరు ఇలా నిరుత్సాహంగా మాట్లాడడం బాగుండలేదు హరనాధ బాబూ!

ఇంట్లోకి వెళ్ళిపోయాడు. సావిత్రి కూడా వెళ్ళబోయింది బియ్యం వెయ్యకుండానే. గోల పెట్టారు వాళ్ళు. ఇంట్లోకి వెళ్ళి మరో పావు బియ్యం పోసుకువచ్చి, కప్పను విడిపించి, వాళ్ళచేటలో గుమ్మరించింది సావిత్రి. కట్టెకు వేలాడి సొమ్మసిల్లినట్టు అయిన కప్ప క్రిందపడుతూనే ప్రాణభీతితో బలవంతాన గెంతుతూ పోయి వాకిట్లో ఓ పక్కగా ఉన్న కళ్ళాపికుండ అడున దాగింది. ఏదోసాధించిన గర్వంతో ఇంట్లోకి వచ్చింది సావిత్రి.

హరనాధ్‌కు సావిత్రితో కబుర్లు చెప్ప

---

# పోల్కంపల్లి శాంతాదేవి

---

ఈ పల్లెలో కాలు ఎలాగా నిలిపారు చదువుకొన్నవారు. ఈపల్లె ప్రజల మూఢ నమకాల్ని సంకుచిత మనస్తత్వాల్ని సంస్కరించే ప్రయత్నం చేయగలిగారంటే మీ చదువుకు సార్ధకం చేకూరుతుంది."

"సరి వాళ్ళ జోలికి పోతే వాళ్ళే మనల్ని సంస్కరించే ఘనులయారు ఈపల్లెజనం నీకు తెలీదు. సావిత్రీ! నీదొక ఆవేశం దానివల్ల ప్రయోజనం సూన్యం కాగా అపహాస్యం ప్రాప్తమౌతుంది. నీకెందుకు' నా కెందుకు పద." అతడు

కోవాలంటే ఒక్క అవకాశం భోజన సమయంలోనే. కావాలని సావకాశంగా కూర్చొంటాడు. కావాలని ఏవో సంగతులు వెళ్ళ దీస్తుంటాడు.

కానీ, ఈ రోజు సావిత్రే వాదం పెట్టుకు కూర్చొంది అతడితో. తనున్న సమాజంలోనే మూఢ సంకుచిత భావాలు జుగుప్సాకరంగా తయారై స్వచ్ఛతనూ, ప్రశాంత జీవనాన్ని దూరం చేస్తున్నప్పుడు ఇతోధికంగా సంస్కరించ గలిగి ఉండి ఉదాసీనంగా ఉండిపోవడం తీవ్రంగా దుయ్యబట్టింది.

"నువ్వేదో కథా నాయకురాలివై పోవాలను కొంటున్నట్టున్నావు!" అన్నా డతడు నవ్వి.

"ఇంట్లో ఉండేదాన్ని నాకు అలాంటి అవకాశాలు తక్కువ బయట తిరిగే వారు మీరు....మీరే కథానాయకులు కావాలని నా కోరిక"

"నువ్వు కథానాయకు రాలివికావాలంటే తరువాత నాయకుణ్ణి నేను అవుతాగావి."

"ఇలాంటి పోకిరీమాటలే వద్దంటాను గొప్పవారు చదువుకొన్న వారు మా బోటి రితో సరసాలాడ వచ్చునా!" బుంగమూతి పెట్టిం. సావిత్రి.

"ఎవరితో ఆడమంటావు" నన్నని స్వరంతో అన్నాడె కొంటెగా చూచి నవ్వి.

గంభీరంగా మారిపోయి మౌనం వహించింది సావిత్రి

అతడూ పద్ధతి మార్చాడు "ఇలాంటి వన్నీ జీవితంలో కలసిపోయిన మామూలు విషయాలు సావిత్రీ! వాటిని ప్రత్యేకంగా ఎత్తి సంస్కరించాలను కోవడం బుద్ధి తక్కువ- వానలు వెనకపట్టుపడితే ఇలాంటి తతంగాలే చాలానే జరుగుతాయి, చెబితే నవ్వుతావు. ఎవరో గర్భిణి స్త్రీని పూడ్చారట అందుకని వర్షం రాలేదట బొక్క తవ్వి బొక్క కడిగే ప్రయత్నంలో ఉన్నారు ఊరివాళ్లు. ఇహ శివుని గుడిలో పూజలు పునస్కారాలు. శివలింగం మునిగే వరకూ గర్భ గుడిలో నీళ్ళు నింపడం ఇలాంటివి ఎన్నో! అవన్నీ మూఢ నమ్మకాలని చెప్ప బోయామంటే. వర్షం రప్పించేందుకు మంచి నమ్మక మేదో నువ్వు చెప్పవయ్యా అంటారు వాళ్ళు అప్పుడు మన మొహం చింతాకంత చేసు కోవడం తప్ప తెలివైన జవాబు మరేదీ ఇవ్వలేం."

"నిండు ఉత్సాహంతో అందులోకి అడుగు పెట్టారంటే తెలివైన జవాబు ఎందుకు దొరకదూ!"

"ఒక చిన్న తప్పును విడిపించడానికి ఒక పావుడు బియ్యం ఎక్కువ గుమ్మరించావు. ఇలా ఇంకెన్నో పెద్దపెద్ద దురాచారాలు మాన్పించడానికి ఎన్ని బస్తాల బియ్యం గుమ్మరించమంటావు?" అని నవ్వి అంతలోనే నిరుత్సాహంగా మారిపోయి "ఉత్సాహం ఎక్కడి నుండి వస్తుంది? ఉన్నది కాస్తా తుడిచి పెట్టుకు పోతే! తోకపీకితే బాగుంటుదని పిస్తూంది నాకు"

"సరి ఆ పని మాత్రం చేయకండి. దయచేసి కుక్కలు చింపిన విస్తరిలా అవుతుంది సేద్యమంతా. ముసలాయన మరీ బెంగపడి పోగలడు. మీ నిరుత్సాహం పోవాలంటే నేను చెప్పిన ఉపాయమే బాగుంది. జయా పజయాలకు ప్రాధాన్యత యివ్వకుండా ఒక కార్యక్రమం ఏర్పాటు




చేసుకోండి మంచి కాలక్షేపం అవుతుంది. ఉత్సాహమూ కలుగుతుంది.''

"మరి- నేను చెప్పినట్టు నువ్వు వింటావా?"

''నేను వినడమేమిటి?'' తెల్లబోయి చూచింది.

''సరి ఇంటిగెలిచి రచ్చ గెలవమన్నారు మంచిదో, చెడ్డదో-విజ్ఞానమో ఎవరి వ్యక్తిత్వాలు వారికి ఉంటాయని ఒప్పుకొంటావు కదూ? సంస్కరించ బూనుకోవా లంటే చాలా సాహసం కావాలి; ముందు అవమానం భరించిన తరువాతే ఏదైనా ప్రయోజనం కనిపించవచ్చు మంచి ఉద్దేశ్యాలు ఆదర్శాలు ఉండగానే సరిపోదు. ఆ అవమానం ఎదుర్కొగల ధైర్యం సహనం నాకు లేవు కనుక నేనేమి చెయ్యా నని చెబుతున్నాను.''

* * *

అర్ధరాత్రివేళ చటుక్కున మెళకువ కలిగింది హరనాథ్‌కు. కుండపోతగా వర్షం కురుస్తున్న చప్పుడుకు లేచి ఒక గంతులో కిటికీ దగ్గరికి వచ్చి చూచాడు టప....టప ... టప.... అడవి మెల్లను ఊపిరి తిప్పుకోకుండా పెద్దపెద్ద చినుకులతో తడిపేస్తున్నాడు వరుణ దేవుడు. తోడుగా వాయు దేవుడు అల్లరిపెడుతున్నాడు.

అతడు పడుకొనే వేళ వరకూ ఒక మబ్బుతునక కూడా కినిపించలేదు ఆకాశంలో. అర్ధరాత్రి వేళ హఠాత్తుగా ఊడిపడ్డాడు వానదేవుడు! నింగిలో నీలంగా కదలిపోయే మేఘాలకేసి రైతులు ఆశగా, తపనగా చూస్తుంటే నిర్దయగా కదిలిపోయిన మేఘాలే అందరూ నిద్దట్లో ఉన్నప్పుడు నిండుగా వర్షిస్తున్నాయి.

వరుణుడికీ మనుషులను అల్లరి పెట్టాలంటే సరదానేమో!

ఆశ్చర్యంగా, ఆనందంగా చాలా సేపు కిటికీ దగ్గర నిలబడి వర్షంలో'కి తృప్తిగా చూస్తున్నాడు హరనాథ్. వాన నీళ్ళలో, చిన్నప్పుడు ఆడుకొనే వయసులో కూడా ఇంత ఆనందించలేదు. ఈ వర్షం కోసం ఇంతగా ఎదురు చూడలేదు. ఇప్పుడెంత ఆనందంగా ఉంది?

నేల దున్నించి విత్తనం వేయించాక-చెట్టు చేమలమీద ఉండే ప్రేమంటే తెలిసి వచ్చింది. తల్లికి తన కన్నబిడ్డ మీద ఉండే ప్రేమలాంటిదే రైతుకు తన చేనుమీద ఉంటుంది. ఇక్కడ ఉన్నవాడు, లేనివాడు అన్న మాటే లేదు. విత్తనం వేసిన రైతుల తపనంతా ఒకటే! ఆతృతంతా ఒకటే!

బిడ్డకు పాలు లేకపోతే తల్లి ఎలా అలమటిస్తుందో పొలంలో చేనుకు వర్షం కరువు అవుతే రైతు అంతగా కలవర పడిపోతాడు. మరో రెండు రోజులు వర్షం రాకపోతే చేను చెరిపించి కొత్త విత్తనం వేయవలసి వచ్చేది! బ్రతికి పోయాయి మొక్కలు

వర్షంలో తడిసిపోతున్న చేను దృశ్యం తలచుకొంటూంటే హరనాథ్‌లో అనిర్వచనీయమైన తృప్తి, ప్రశాంతతా చిందులేయసాగాయి

# 8

'బాబాయ్! మీరు కొంచెం కుర్చీలో కూర్చోవాలి కాస్సేపు. పక్క బట్టలు మారుస్తాను.''

సావిత్రి సాయంతో ఈజీచెయిర్‌లోకి చేరారు ఉమాపతిరావుగారు. మాసిన బట్టలు తీసివేసి పరుపుకు, దిండ్లకు తెల్లగా ఇస్త్రీ చేసిన కవర్లు తొడిగింది సావిత్రి. గది శుభ్రంగా ఊడ్చి, డెట్టాల్ నీళ్ళు చిలకరించి, గుడ్డేసి తుడిచింది. స్టూల్ మీద తెల్లగా తోమిన చెంబులో మంచినీళ్ళు గ్లాసు తెచ్చి పెట్టింది. చిల్లర పనులన్నీ



పూర్తి చేసి. "పడుకొంటారా, బాబాయ్! కాస్సేపు కూర్చుంటారా?" అని అడిగింది.

సావిత్రి పట్ల కృతజ్ఞతతో నిండిపోయింది ఆయన హృదయం. 'కష్టసుఖాలు బాగా తెలిసిన పిల్ల. సౌజన్యమూర్తి. కన్నకూతురు గానీ, కట్టుకొన్న భార్య గానీ చేయలేని సేవ చేస్తోంది.... ఏనాటి రుణానుబంధమో గాని.' ఆ యువతి చేసే పనులన్నీ ఆర్ద్రంగా చూస్తున్న ఆయన 'పాపం-వయసొచ్చిన పిల్ల కదూ? పెళ్ళి కావలసిన పిల్ల!' అనిపించింది చటుక్కున. ఇదివరకు వంట మనిషిగా చూసినా ఇప్పుడు అలా చూడలేక పోతున్నారు.

ఏదో అనుబంధం, బాధ్యతా ఉన్నట్టు తోస్తూంది. 'ఓ నాలుగైదు వేలు ఖర్చు పెట్టినా సరే-ఒక మాదిరి సంబంధం చూసి ఒక ఇంటిదాన్ని చేస్తే బాగుంటుంది కదూ?' అనుకొంటే ఏమిటో ఉత్సాహం గానే ఉందిగావి, 'పూర్తిగా పరాధీనమైంది నా బ్రతుకు. ఎన్ని వందలు గుమ్మరిస్తే మాత్రం సావిత్రిలాంటి పిల్ల దొరుకుతుంది తన అవసరాలు చూడను?' అవి ఆలోచిస్తే స్వార్థం నిరుత్సాహ పరుస్తూంది!

ఒక విధంగా కళ్యాణి ఆలోచనలు కూడా ఈ దోవనే పయనిస్తున్నాయి. 'ఒకనాడు ఈ సావిత్రిని గురించి నేనెంత అల్పంగా తలచాను?' అనుకొంటే సిగ్గుతో కుంచించుకు పోతుంది అంతరంగం.... 'ఆ పిల్ల ఆత్మస్థైర్యం, నిష్కల్మష ప్రవర్తనా ఎందరికి అలవడుతుంది?'

ఇంట్లో ఎవరికి ఏది కావాలన్నా.... 'సావిత్రీ! సావిత్రీ!' అంటూ కేకలు వేయవలసిందే!

హరనాథ్ పట్ల సావిత్రి ఉదాసీనత ముదిరినకొద్దీ అతనిలో అనురాగం బలీయమౌతోంది. ప్రప్రథమంలో ఆమె మీదున్న ఓ [illegible] ఉంటేదేమో! క్రమక్రమంగా ఆమె అంతరంగ ప్రవృత్తి అవగతమౌతుంటే అతడి హృదయం ప్రణయాంజలిపై ఆమె ముందు మోకరిస్తోంది. ఆమె ఇటు చూడకుండా నిర్లక్ష్యంగా, నిర్దయగా నడచి పోతుంటే తపనగా అనుకొంటూంటాడు హరనాథ్— 'అందరి హృదయాలలో సుస్థిర స్థానాన్ని ఆక్రమించుకొన్న నీ హృదయ మందిర పీఠంపై అధిష్టించడానికి ఏ మూర్తి అదృష్టం నోచుకొన్నదో' అని.

ఒక సాయంత్రం బావి దిక్కుగా వెడుతూ సావిత్రి తనతో ఆహ్వానించాడు హరనాథ్.

"నాకేం పని?...." అందామె ముఖావంగా.

"రేపటి వంటకు కావలసిన కూరగాయలు కోసుకొచ్చుకొందువు."

మృదువుగా తిరస్కరించింది సావిత్రి. "ఉహుఁ....ఓపిక లేదు రావాలంటే!.... ముల్లంగి పంటకు వచ్చిందన్నారు కదా, ముల్లంగీ, పచ్చి మిరపకాయలు, తోటకూర నారిగాడిని పట్టుకు రమ్మని చెప్పండి."

అక్కడ పప్పులుడకవని చెల్లెలినీ, తమ్ముడినీ మెల్లగా తనతో పైకి తీసుకుపోయి చెరో చాక్లెట్ నోట కుక్కి చెవిలో గుస గుసగా ఏవో చెప్పి క్రిందికి పంపాడు హరనాథ్.

"బావి దగ్గరకు వెళదాం రా, అక్కా! మరే, అన్నయ్య మొక్కజొన్న కండెలూ, వేరుశెనక్కాయలూ కాల్పించి పెడతాడట."



''వెళ్ళండి. నేనెందుకు?''

''అన్నయ్య అప్పుడే వెళ్ళిపోయాడు విన్ను తీసుకు వచ్చెయ్యమని చెప్పి.''

''ఒకసారి నన్ను నాటకమని దబా యించాడు ఇప్పుడు తమ నాటకాలు మొదలు పెట్టాడు.' నవ్వుకొంది సావిత్రి. 'కానియ్యి ఏం జరుగుతుందో చూదనా?' కూరగాయలకు బుట్ట తీసుకొని పిల్లలతో బయలుదేరింది

చాలినంత వర్షం పడడంవల్ల పైరులు పచ్చగా, నిండుగా ఉన్నాయి. జొన్నచే కంకి ఈని పాలు పోసుకొంటూంది. వేరు శెనగ బచ్చగా పరుపులా పెరిగింది. పిల్లలు వస్తూనే కొబ్బరికాయలకు ఎగబడ్డారు.

కూరగాయల తోట దిక్కుగా వెళ్ళింది సావిత్రి. మిరప తోట పక్కగా సన్నగా చెరువునుంచి కాలవ పారుతూంది. పచ్చిక మొలిచిన సన్నని వడ్ల నడుమ. మిరప తోట నిండుగా పూతా పిందెతో రెపరెప లాడుతూంది. తోటలో మధ్య-మధ్యా బంతిమొక్కలు మొగ్గలు వేశాయి దసరా వరకు గుమ్మాలకు కట్టుకోడానికి పువ్వు లివ్వొచ్చు. ఆ పక్కనే ఏవో కాయ పాదులు, బెండ గోరుచిక్కుడు - ఒకటి లేకుండా అన్ని రకాలూ పెట్టబడ్డాయి.

సావిత్రి రావడమే అలస్యంగా వచ్చిందేమో. అప్పుడే సంధ్యపడిపోతున్నది. త్వరత్వరగా మిరపకాయలు గిల్లసాగింది.

''ఇక్కడున్నావా?'' అంటూ వచ్చాడు హరనాథ్. సావిత్రికి చాలా సమీపంగా

ఒంగి తనూ మిరపకాయలు త్రుంచ సాగాడు.

"మీ కెందుకండీ శ్రమ! నేను కోసు కొంటున్నానుగా!"

"చీకటి పడిపోతూంది. కాయలు కని పించవు తొందరగా కానీ, మల్లిగాడు కంకులు, వేరుసెనక్కాయలు కాలు స్తున్నాడు. తినొద్దూ?" అంటూ మరింత చేరువగా వచ్చాడు. తెల్లని ఫాలంపై సున్నితంగా చెలిస్తూన్న ముంగురులను చూస్తూ, మిరపకాయలకు బదులుగా సావిత్రి వ్రేళ్ళను పట్టుకొన్నాడు మిరప మొక్క కొమ్మల్లో.

"సావిత్రీ!" అన్నాడు భావోద్వేగంతో.

విడిపించుకోకుండా నిశితంగా నిశ్చ లంగా చూచింది సావిత్రి.

"నీకు.... నీకు ఇష్టంలేదా నేనంటే!"

"ఉహుఁ ఇష్టంలేదు. మిమ్మల్ని తప్ప మీ యింట్లో అందరినీ ప్రేమించ గలుగు తున్నాను" మందస్వరాన అంది సావిత్రి అతడి నేత్రాలలోకి నిర్భయంగా చూస్తూ.

"నీ దృష్టిలో అంత నీచుణ్ణా?"

"స్త్రీని ప్రేమించడం మీకు తెలియదు. హరనాథ్ బాబూ! ఒక రాత్రికి వెయ్యి రూపాయలిచ్చి కొనడంమాత్రం తెలుసు. మిమ్మల్ని ఎలా యిష్టపడతాను? ఎక్కడో ఒక చిన్న నీడ చూచుకొని చల్లగా కాపురం చేసుకోవాలన్న కలలు నావి. ఆ కలలు సార్థకంచేసే విలువైన మనుషులు కాదు మీరు. కోరి మిమ్మల్ని నా జీవితం లోకి ఎలా ఆహ్వానించగల ననుకొన్నారు? ఏ నాటికీ అసంభవమది."

కొంచెం విసురుగా, అవహనంగా అడిగాడు "ఎన్ని రాత్రులు, ఎన్ని వెయ్యి రూపాయలు పోగొట్టుకొన్నానని నీ అంచనా?".

"నా కేం తెలుసు?" ముఖం తిప్పేసు కొంది.

"తెలియనిదానివి మాటిమాటికిలా మాట విసరడం బాగుందా?" రెండు చేతు ల్లోకి ఆమెముఖాన్ని తీసుకున్నాడు.

"నీలకాంత ఒక వేశ్య కూతురు. అందుకని ఆ దృష్టితో చూచానేమో! ఒక చంచలమైనక్షణంలో జరిగిపోయిన సంఘ టన అది. అదిఎత్తి యిలా దెబ్బతీయడం సబబుకాదు."

"కావచ్చు."

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను సావిత్రీ! నువ్వు కోరిననీడ నేనివ్వగలను. నా మాట నమ్ము."

తృణీకారంగా అతడి చేతులు నెట్టి వేసింది సావిత్రి.

"సుధాకర్ మీద ఉన్న నమ్మకం నీకు నా మీద లేదన్నమాట?"

ఒక్కక్షణం తెల్లబోయి చూచింది "అతడిని నమ్మవలసిన అవసరం నా కేం ఉంది!"

''నాకు తెలుసు. నువ్వు సుధను ప్రేమిస్తున్నావు.''

పేలవంగా నవ్వింది సావిత్రి. ''తెలిసి, ప్రేమభిక్ష కోరారా నన్ను?''

"ఏదో ఒకటి తేలిపోతే గుండె రాయి చేసుకోవచ్చుని."

"అయ్యో! పెళ్ళి చేసుకోవలసిన వారు నన్ను కాకపోతే మరొకరివి. గుండె రాయి చేసుకొంటే ఎలా ఆ వచ్చినావిడ గతి? ఒక హితవు నే చెప్పే దేమిటంటే స్త్రీనుండి తను కోరినవి పొందడంకోసమే గాక, ఆమెను ప్రేమతో అలరించే సున్నితమైన ఆరాధనా హృదయం ఉంచేనే ఆమెను మీ జీవితంలోకి ఆహ్వానించాలి. ప్రతి సాధారణ అసాధారణ స్త్రీ కూడా మగవాడినుండి అదే కోరుకొంటుంది.''

ఆవిడ నీతిబోధకు ఒళ్లుమండి ఆగ్రహంతో చిందులు వేసేవాడో, ముగ్ధుడై ఇంకా తన ఆరాధనను ఆమెముందు సమర్పించేవాడో గాని—

''బాబుగారూ, కంకులు వేరుసెనక్కాయలు కాల్చానండీ'' అంటూ మల్లిగాడి కేక వినిపించింది.

(సశేషం)



# భవబంధాలు

మంగళంపల్లి వెంకటు సీతారామయ్య

జీవితంలో చాల సార్లు ఓడి పోయాను. ఓడిపోయినట్లుగా సామాన్యంగా సాయంకాలమే తెలిసేది. అందుకే నాకు సాయం కాలం అంటే అదొక రకమైన భయం. అస్తమిస్తున్న సూర్యుణ్ణి చూస్తుంటే అంతమొందుతున్న జీవితానుభూతిగా అనిపించేది.... ఆ క్షణంలో ఎవరికైనా సినిక్‌గా కనపడతాను.

మనోచాపల్యం వల్ల ఆ డిజైన్ అలా ఉంటే ఎంత బావుంటుందో అని అనిపిం చింది, నా మీద కసికొద్దీ ఏమో మరి కాసిని రాక్షసి చినుకులు మీదపడి దాన్ని వికృతం చేశాయి. గబ-గబా వరదరావు హోటల్ ఎదరొచ్చి ఆగాను. కుండపోతగా కురుస్తోంది. ఒక్కొక్కరే మెల్ల-మెల్లగా వచ్చి చేరుతున్నారు. క్షణ-క్షణానికీ వెనక్కి జరగాల్సి వచ్చింది. ఇంకా వెనక్కి వెళ్ళడంలో కాళ్ళకి ఏదో బుట్ట తగిలింది. చటుక్కున వెనక్కి చూశాను. ఓ ముసలమ్మ బజారు బుట్టలో వేరుశెనగ కాయలు, మరో బుట్టలో జంతికలు పెట్టు

---

ఆదరణ ఆత్మీయతకు బంధుత్వం సమాన హోదాలు అవుసరంలేదు!

మనసు మెత్తనైన ప్రతి మానవునికీ అందరూ సమానమే!

---

ఆ వేళ కూడ నేను ఓడిపోయిన ఓ సాయంకాల సమయం. బి. యడీలో చేరి రూముల కోసం ప్రత్యేకంగా తిరిగి-తిరిగి కాళ్ళు పీకే సమయానికి చెదురుమదురుగా తెల్లకొంగలుగా ఉన్న పిల్లమేఘాలు గుమి గూడి చిక్కటి ఏనుగుల బారుగా రాజ మండ్రిని అంతా కప్పి వేశాయి. తృటి కాలంలో. అల్లంత దూరంలో ఉంది డీలక్స్. అప్పుడే పది-పదిహేను చినుకులు పడి చొక్కా కొత్త డిజైన్ రూపొందించు కుంది.

కుని కూర్చుంది. కవల పిల్లల్లా చెరోచేత్తో చుట్టేపి దగ్గరకి లాక్కుని కూర్చుంది. "ఏమను కోకు మామ్మ. చూళ్ళేదు!" అన్నాను. "పర్లేదు బాబూ!" అంది. మామ్మ వెనకాలే ట్రాలీ ఉంది. అక్క డక్కడ దాని మీద కూర్చున్నారు జనం. నాకూ నీర్సంతో కూర్చోవాలనిపించింది. కాని మామ్మ ప్రక్కనేచోటు ఉంది. కాని కాళ్ళకి బుట్టలు తగుల్తాయి. మెల్లిగా "మామ్మా! ఇక్కడ కూర్చుంటాను. బుట్టలు కొంచెం ప్రక్కకి పెడ్తావా?"

అన్నాను. "కూకో బాబూ!" అంది. నే కూర్చున్న తరువాత మళ్ళీ బుట్టల్ని దగ్గరకి లాక్కుని కూర్చుంది.

కూర్చున్న తరువాత ఓ పదిపైసలు వేరుశెనగకాయలు కొనుక్కున్నాను. మనుషుల మధ్యనుంచి తిరుగుతున్న కార్ల లైట్ల వెలుగులో నిదానంగా, నిరాటంకంగా పడుతున్న వానధారల్ని చూస్తున్న మామ్మ కళ్ళకేసి చూస్తే-ఏదో వైరాగ్యం, వేదాంతం కనపడుతోంది. "మామ్మా! ఈ వర్షం వల్ల నీకు నష్టమా? లాభమా?" అన్నాను.

"లాబవే బాబూ! ఎంత లాబవో అంత నష్టం! నా గురించి ఆగిపోకుందా దిక్కుమాలిన అన....ఇప్పుడే ఏయించుకున్నాను ఈ బుట్ట జంతికలు - ఇప్పుడయితే కర-కర లాడతాయి. ఈ ఆనొస్తే మెత్తబడి పోతయ్. ఎవరు తింటారు?" అంది.

నిజమే! బ్రతుకు తెరువంతా ఆ రెండు బుట్ల మీద ఉంచుకుంది. ప్చ్-మౌనంగా కాయలు ఇనప కమ్మీని వేసి కొట్టుకుంటున్నాను. చేరిన జనంలో స్నేహాలు ఏర్పడ్డాయి. రక-రకాల టాపిక్స్ మాట్లాడుకుంటున్నారు. మాట్లాడిన వాళ్ళం నేనూ, మామ్మే అనిపించింది నన్ను పలకరించిన వాడు ఒకడే! అక్కడున్న అరగంటలో అరవై సార్లు తైమడిగాడు.

వర్షం వెలిసింది. అయినా రోడ్డు మీద నీళ్ళు తీసేవరకు నిలబడి ఉంది జన సమూహం. ఇంతలో "ఎక్కడెహె! ఆ ముసలి నంజ...." అంటూ బిగ్గరగా సణుక్కుంటూ వస్తున్న ఒక రిక్షావాలా-కమ్-త్రాగుబోతుని దూరంగా చూసి ఉలిక్కిపడి గబ-గబా మొల్లో ఉన్న గుడ్డ సంచీ తీసి ఒక రూపాయి కాగితం, గుప్పెడు చిల్లర తీసి నా చేతిలో పెట్టి "బాబూ! మీకాడ ఉంచండి. నే మళ్ళీ అడుగుతాను-ఆడొచ్చేస్తున్నాడు..." అంది. ఆ అభ్యర్థనలో ఒక విధమైన బాధ, ఆ కంఠంలో ఆదొక రకమైన వణుకు నన్ను విచలితుణ్ణి చేశాయి. అసంకల్పితంగా గుప్పెట మూసి జేబులో పెట్టుకోవడం, అతను మామ్మని సమీపించడం ఒక్క క్షణంలో జరిగాయి. "ఆ సంచీ ఇలాగియ్ నంజా!" అని మొల్లోంచి లాక్కున్నాడు. "ఏటిది-ఐదు పైసలా....ఛీత్!" అని సంచీ మొహం మీద కొట్టాడు. ఈ గబిడబిడతో వర్షం వెలవడం, అందరూ ఎవరి దారిన వాళ్ళు వెళ్ళడం జరిగింది.

"నడు, రిక్షా ఎక్కు." అని బుట్టలు తీసుకొని రిక్షాలో పెట్టి, మామ్మని చెయ్యి పట్టుకు ఈడ్చుకు పోయాడు. ఇంచుమించుగా రిక్షా దగ్గరకి ఎక్కిన తర్వాత వెనక్కి చూసి చేత్తో సంజ్ఞ చేసింది 'మళ్ళీ వస్తాను' అన్నట్టుగా. రిక్షా జోరుగా వెళ్ళిపోయింది.

ఇంకో రిక్షా కేకేసి మా వాళ్ళింటికి




పోయాను. అక్కడ భోజనం చేసి తీరుబాటుగా లెక్క చూస్తే నలభై పైసలు తక్కువగా ఐదు రూపాయలు ఉన్నాయి. ఈలోగా మా అత్తయ్య "చిల్లర ఉంటే ఇవ్వు. నోట్లు ఇస్తాను." అని చిల్లర ఆవిడ తీసుకుంది. రాత్రి ఎప్పటికో గాని నిద్ర పటలేదు.

ఉదయమే లేచి అన్నీ ముగించుకొని కాలేజీకి వస్తూ అక్కడ చూస్తే మామ్మ లేదు. కాలేజీ టైమయింది. అక్కడ ఉన్న కొట్టు అతనితో చెప్పి, మామ్మ ఆనవాలు చెప్పి మధ్యాహ్నం వస్తానని చెప్పమన్నాను. రీసెస్‌లో వచ్చి చూస్తే—హమ్మయ్య-మామ్మ ఉంది. చిరకాలంగా చూడని బంధువులని చూపినట్లు అనిపించింది. ''మామ్మా! చిల్లర అవసరమొచ్చింది.'' అంటూ అయిదు కాగితాలు పర్సులోంచి తీసి ఇచ్చాను. మొల్లో సంచీ తీసుకుంటోంది. ''నేను టిఫిన్ తినాలి.'' అంటూ నాల్గడుగులు వేసేసరికి ''బాబూ!'' అంటూ మళ్ళీ కేక వేసింది. "ఏం?" అంటూ ఆగాను. నలభై పైసలు చేతికిచ్చింది. బిగిసి పోయాను. షాక్ నుంచి తేరుకొని "అయితే నిన్న నువ్వు లెక్క పెట్టుకున్నావా?'' అన్నాను ''మీకు నలభై పైసలు పెద్ద నష్టం కాదు గానీ, నేను లెక్క బెట్టుకోపోతే ఆ నలభై పైసలే పెద్ద నష్టం.'' అని పేలవంగా నవ్వింది.

నాకు ఆ క్షణంలో మామ్మలో మూర్తీభవించిన న్యాయం, ధర్మం కన్పించాయి. ''మామ్మా! రాత్రి....అతనెవరు?'' ''నా కొడుకు బాబూ! కుక్కల కొడుకు! ఈడయితే ఎప్పుడో గోదారిలో కలిసిపోయేదాన్ని. కాని ఓ పొరపాటు చేశాను. ఈడికి నా మనసురాల్ని ఇచ్చాను. దాని బాబూ, అమ్మా అమ్మోరి దగ్గరికి వెళ్ళి

పోయారు చిన్నప్పుడే! నేనే పెంచి ఈ ఎదవకి కట్టబెట్టాను. ఈడికో ఆడ కూతురు. అయినా సుకం నేదు. ఎంత సంపాయించినా తాగుతాడు. ఆళ్ళ తిండికి నేను సంపాయించాను అందుకే ఈ బాధ బాబూ!'' నేనింకా అలాగే నిలబడ్డం చూసి ''బాబూ! మీరు సదువుకునే ఓరు, ఇయేవి మనస్సులో పెట్టుకోకండి. మీకు నా దణ్ణాలు . లేపోతే ఈ అయిదూ ఆడైనా తాగేసే ఓడు .బగమంతుడు మిమ్మల్ని సల్లగా సూడాల....'' అని మెల్లిగా భుజం మీద తట్టి వెళ్ళిపోయింది. ఆ బుట్టలు కను మరుగయే వరకు అలాగే చూస్తూ ఉండి పోయాను. టైము అయిపోయింది. లోవ లకి వెళ్ళకుండా మళ్ళీ కాలేజీకి వెళ్ళి పోయాను.

తర్వాత ఏమి జరిగి ఉండకపోతే ఎంతో తృప్తి మిగిలేది....జీవితం లలిత మైన సంగీతంలా ఉండేది. కాని ఆరోజు విపరీతమయిన స్వరాలు వినపడ్డాయి. ఆర్కాట్ గార్డెన్స్‌కి వెడుతున్నాను రిక్షా మీద. ఓ చోట పోలీసులు హడావుడిగా తిరుగుతున్నారు. ట్రాఫిక్ బంద్ అయి పోయింది. ''మాస్టారూ! ట్రాఫిక్ బంద్ అయింది. గాడీలు వెళ్ళడం లేదు. కావ లిస్తే నడచి వెళ్ళండి'' అన్నాడు ఓ పోలీసు. రిక్షా దిగి, ఎదరకి నడచి వెళ్ళి పోతున్నాను వడి-వడిగా. నాకు యాక్సి డెంట్లు అన్నా వాటి గురించి వాకబులన్నా పెద్ద భయం, వడి-వడిగా అడుగులు వేసుకు పోతున్నాను. అయితే కుడిచేతి వేపున దూరంగా బ్రద్దలుగా విరిగిపోయిన ఆ బుట్ట వికృతంగా కన్పించింది.

మనస్సులో తీతువు కూసింది వెనక్కి జంకుతూ వచ్చి చూశాను -ఆ మృత్యు చక్రం క్రింద మామ్మ శవం- కళ్ళు చీకట్లు క్రమ్మాయి అంతే- తర్వాత ఎం జరి గిందో నాకు తెలీదు.

కళ్ళు తెరిచేసరికి తెల్లటిబట్టలతో దేవ దూతలా పారిజాత పువ్వులా నవ్వుతూ నర్సు కన్పించింది. -''ఇక్కడికి ఎలా వచ్చాను? 'అని పైకి సణిగాను. నామాట విని బయట కూర్చున్న సుందర్, శర్మలు లోపలికివచ్చి యోగక్షేమాలు అడిగారు. ఓపిక వచ్చింది-డాక్టరుకి నమస్తేలు చెప్పి బయటకు నడచివచ్చాము.

వస్తుంటే చెట్టు క్రింద కూర్చుని ఉన్నాడు మామ్మకొడుకు వాడి ప్రక్కనే ఒక బక్క ప్రాణాన్ని చంకలో వేసు కొని ఒక అస్తిపంజరం లాంటి ఆడది వెక్కి-వెక్కి ఏడ్చి ఇంక ఏడ్వలేక దెక్కు తోంది. వారిప్రక్కన కూర్చుని ఎంత నష్టపరిహారం పుచ్చుకోవాలో తర్కించు కుంటున్నారు. మధ్యవర్తులు అటు, ఇటూ తిరుగుతున్నారు- వాళ్ళనిదాటి వచ్చేశాము. మామ్మ ప్రాణానికి విలువ కాస్పేవట్లో కడతారు. -పోనీ ఇప్పుడైనా జాగ్రత్తగా ఉంటుంటే మామ్మ ఆత్మ శాంతిస్తుంది.

నా అస్వస్థతవల్ల నేను మాట్లాడటంలేదని. సుందర్. శర్మలుకూడా మౌనంగా నన్ను అనుసరిస్తున్నారు.

మనసు వికలమయి ఒక వారం రోజుల వరకు మనిషిని కాలేకపోయాను. ఆ తర్వాత జీవితం మళ్ళీ గాడిలో పడిపోయింది. రికార్డులు, స్పెషల్ వర్కు– అంతా గజిబిజి- కాల ప్రవాహంలో గడ్డిపోచగా కొట్టుకుపోతోంది జీవితం.

ఇయితే మళ్ళీ అదే డీలక్స్ హోటల్ దగ్గర ఓ సన్నివేశం జీవితానికి అర్థం నేర్పింది. వేదాంతం ఓ క్షణంలో అర్థమయింది.

''బాబూ- బిడ్డ సచ్చిపోయింది-కడుపు శోకం- ఆకలి బాబూ - ధర్మం బాబూ-'' అని అరుస్తోంది ఓ బిచ్చగత్తె. అప్రయత్నంగా జేబులో చేయిపెట్టి డబ్బులు పైకి తీయకుండానే తడుముకున్నాను రెండు పైసల బిళ్ళకోసం- ఒకటి వుండాలని బాగా జ్ఞాపకం- అయితే అందట్లేదు. ఇంత సేపూ వెధవపోజు కొట్టి ఏమీ వేయలేకపోతే ఎలా అని అయిదు పైసలు తీసి వేస్తూ ''ఈ అదృష్టవంతురాలు ఎవరా?'' అని ముఖంకేసి చూశాను. -అరే-మామ్మ మనుమరాలు- ఆ వేళ హాస్పిటల్ దగ్గర చూశాను- ''సల్లగుండాల,'' సణుక్కుని నన్ను దాటిపోయింది ఆమె.

లోపలికి వెళుతూ ఏదో స్ఫురించి వెనక్కి తిరిగాను. ఒక ముసలి రిక్షావాలా ''బాబూ-గాడీ-''అన్నట్లుగా చూస్తున్నాడు. మెట్లదగ్గరకి కేక వేశాను. ''టీ తాగుతావా!'' అన్నాను. "హి-హి- మీదయ'' అన్నాడు. కాఫీకి, టీకి ఆర్డరు యిచ్చి మెల్లిగా మామ్మకొడుకు గురించి వాకబు చేశాను.

''ఏం చెప్పను బాబూ- చచ్చిపోతూ కూడ వెయ్యి రూపాయలు ఇచ్చిపోయింది -మా ఎదవలకి అవసరానికి మించి అర పైసాకూడ ఎక్కువ ఉండకూడదు బాబయ్యా–ఒకటా- రెండా వెయ్యి రూపా

---

యలు- జోరుగా త్రాగేసేశాడు—పైగా ప్రొకెట్టు- డబ్బు గలగల మంటుంటే అంతవరకు ఉపయోగించిన ఆడి ఆడది ఏత్రాపిలా కన్పించింది. ఓ బజారు ఎస వని తగుల్కున్నాడు. అంతా అయి పోయింది- బాకీపడితే ఓనరు రిక్షా లాగేసు కున్నాడు. తిండి, వైద్యం లేక చంటి ముండ గుటుక్కుమంది, ఆడు ఒంటి నిండా సంకటాలు తగిలించుకొని- రకత కన్నీరులో నాగభూషణంలా ఏడు త్తున్నాడు- అ ఎర్రిపిల్ల ఆడ్ని కనిపెట్టు కొని -అడుక్కుని -కాసిని గంజినీళ్లు పోస్తోంది- అదండీ ఇసయం- శలవు బాబూ- బేరాలు పోతాయి-'' అంటూ దణ్ణంపెట్టి పోయాడు. బిల్లు చెల్లించి బయటకు వచ్చాను. ఆ పిల్ల దూరంగా ఉంది. అటువేపుగా వెళ్లి జేబులో ఉన్న అయిదు రూపాయలు యిచ్చాను బిత్తర పోయింది -'కాదు- తీసుకో- వేరు శెనగ కాయలుఅమ్మే మామ్మ నాకు బాగాతెల్సు, పాపం చచ్చిపోయింది. తీసుకో, ఇంతి కన్నా ఏం చేయలేను'' అన్నాను.

మామ్మని తల్చుకొని బావురుమంది.- ''నేనూ దానిదగ్గరకు వెళ్లిపోదామని చాల సార్లు గోదారిగట్టు కెళ్ళాను. అయితే అడు దిక్కులేని చావుచత్తాడు. ఎవరూచూడరు. అని చావలేక బతునుతున్నా బాబూ'' అని ఆగి, ''బాబూ! ఆడు చలికి వణికిపోతు న్నాడు— ఈ డబ్బెట్టి ఓ నల్లదుప్పటి కొనిపెట్టండి బాబూ- మేము అడిగితే నాపి రకం అంటకడ్తారు'' అని డబ్బు యివ్వ బోయింది. ''అది నీ దగ్గర ఉంచుకో- కాస్త మనిషిగా తయారయి- ఈ పని మానేసి- ఏదైనా కూలి పనిచేసుకో - దుప్పటి నేను కొనిపెడ్తాను'' కళ్ళతో నీళ్ళు నింపుకొని చంటిపిల్లలా తల ఆడించింది.

ప్రక్క కొట్లోకి వెళ్ళి బిన్ని నల్ల దుప్పటికొని ఆమెకు ఇచ్చాను. ''దణ్ణాలు బాబూ- మీ మేలు మరువలేను- ఈ దుప్పటి అడికి కప్పుతాను. నే నీ పని మానేస్తాను బాబూ- కూలిపనిలోకి ఎడ తాను బాబూ - వ త్తా బా బూ - వత్తా-'' అంటూ అస్తిపంజరాన్ని వడివడిగా కదు ల్చుకుంటూ నడచిపోయింది.

ఆమెని, ఆమెచేతిలో నల్లదుప్పటిని, ఆ దుప్పటి ఎర్ర అంచుని- కనరదేవరకు చూస్తుంటే- భుజంమీద ఎవరివో చేతులు పడ్డాయి-సుందర్, శర్మ- ''భవబంధాలు'' అన్నాను మెల్లిగా. *

---

మనమూ రంగంలోకి దిగాము. ఇకతుది విజయం సాధించే దాకా వెనుదిరిగి చూచేది లేదు. దేశ ప్రజల ఉత్సాహోద్రేకాలను ఒక సంపూర్ణమైన నిర్మాణ కృషిగా మనం మలచుకోవాలి.

శ్రీ పి. వి. నరసింహారావు
ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి.

# ఇప్పుడు!

ఇప్పుడు పాడవలసింది
యుద్ధ గీతికలు కానీ
ప్రణయ గీతికలు కాదు।
ఇప్పుడు వ్రాయవలసింది
ప్రేమ పురాణాలు కాదు
రణరంగ గాథలూ బాధలూ।
ఇప్పుడు చదవవలసింది
వంటింటి చరిత్ర కాదు
ఇంటింటి విప్లవం।
ఇప్పుడు వెలిగించవలసింది
పెదవులపై చిరునవ్వు కాదు
గుండె గుండెలో
నిండుగా చైతన్యం।
ఇప్పుడు వల్లించేవి రాజకీయాలు కాదు
సమరంలోని పద్మ వ్యూహాలు।
నీ శౌర్యంతో జన్మ భూమి
పులకలెత్తే సమయ మిది।
నీ త్యాగంలో పుడమి తల్లి
గర్వపడే కాలమిది।
పద ముందుకు
పద ముందుకు
పద పద।
బందూకును
చేత దాల్చి
శత్రుఘ్నను
పరి మార్చగ
పద ముందుకు
పద ముందుకు
పద పద।

కొడిమెల శ్రీరామమూర్తి



# చలి చీకటి అమ్మాయి

పసుపులేటి మల్లికార్జునరావు

అతను సినిమా హాల్లోనుంచి బయటికి వచ్చేడు.

రెండో ఆట మొదలయి అర గంట కూడా కాలేదు. పోనీ బోరు కొట్టిందనుకుంటే అది తెలుగు సినిమా కాదు. ఆఖరికి ఆ హడావుడేమిటో గాని గేట్‌కీపర్ ఇవ్వబోయిన అవుట్‌పాస్‌కూడా తీసుకోలేదు.

బయట యమచలిగా వుంది. జనవరి రోజులు. అందులో హైదరాబాదు చలి, పావుగంటసేపు ఆ చలిలో నిల్చుంటే రక్తం గడ్డ కట్టుకుపోను. “మీ [illegible] [illegible] దగ్గరు చెప్పినా [illegible].

మెయిన్‌గేటు దాటి వచ్చేసేడతను. రోడ్డుమీద ఎవరూ తిరగటంలేదు, రిక్షా వాళ్ళు కూడా బండిలోకి ముడుచుకుపోయి గొంగళీలు, దొంతెలు కప్పుకొని కునుకు తీస్తున్నారు. అతను -ఆదరా బాదరా-

కొంపలు మునిగిపోతున్నట్లు నడుస్తూ- తన నెవరయినా గమనిస్తున్నారేమో నని అటు యిటుగూడా పరికించిచూడటం మాన లేదు. కొంతదూరం వెళ్లాక ఎవరూలేరని ఎర్ధారించుకుని, వీధిదీపం క్రింద చేరి-క్రీ పీఠలోనికి తప్పుకొని జేబులోంచి పర్సు లా. ఌ. బరువుగానే తోచింది. జిప్ లాగే. . నోట్లబొత్తి! అతని ముఖం వికసించింది. మళ్ళా రోడ్డుని నాలుగువేపులా సారించి చూశాడు. ఎవరూ రావటంలేదు. తృప్తిగా శ్వాసవదిలి నోట్లు మడతలు చాడు. అతని మనసిపుడు సంతోషంగా వుంది. మధ్యాహ్నంనుంచి కాపు వేస్తే రెండోఆటకి గాని ఫలితం దక్కలేదు. ముందిప్పుడు- ఈ కష్టం మరిచిపోవాలంటే, ఏదయినా కాకా హోటలుకుపోయి పులావూ, చాయ్ కొడితేగానీ లాభంలేదు. తన జేబులోను ఉన్న నోట్లకట్ట వారం పాటయినా ఖుషామత్ చేస్తుంది.

మైనే జీనా సీఖ్ లియా....యాల పాట మొదలయింది.

---

ప్రతిదీ చేత జిక్కించుకు ప్రయత్నించే మొనగాడనుకునే మొగాడికి అబలలుగా కనుపించే మొనగత్తెలున్నారనే విషయం ఋజువైతే?!

---

జేబులో కుక్కేసి చిల్లర పై జేబులో వేసుకుని, చివరిసారన్నట్లు రోడ్డంతా కలయచూసి మళ్లా నడక సాగించాడు పాతిక అడుగులు వెయ్యగానే- హఠాత్తుగా నిల్చుండిపోయేడు. అతను నిల్చున్నచోట- క్రింద రోడ్డుమీద అందంగా [illegible] మూర్తపుంది. ఏదో [illegible] [illegible]- [illegible] [illegible] [illegible]- [illegible] [illegible] లో పడ్డికిపోయేలా [illegible] [illegible].

హాష్యయ్య అన్నట్లు హాయిగా నిట్టూర్చి తీవిగా నడవటం ప్రారంభిం

మరో వంద అడుగులయినా నడవ లేదు—

ఉలిక్కిపడి నిల్చుండిపోయేడు.

అందుక్కారణం పోలీసు మాత్రం కాదు!

అందమైన అమ్మాయి!?

నిర్మానుష్యమైన రోడ్డుమీద ఒంటరిగా నడిచివస్తోంది రోడ్డుమీద -వెనక్కి- ముందుకు- [illegible]డుస్తూనే-బెదురు బెదురుగానే చూస్తోంది. కళ్ళు సంచలంగా భయంగా కదులుతున్నాయి తెల్లటి పాల నురగు లాంటి చీర. బొడ్డు కనబడేలా కట్టింది.

తెల్లటి స్లీవ్‌లెస్ బ్లవుజూ, ఒక చేతిలో కూరగాయల బుట్టంత వానిటీబాగ్, ముడిచిదిద్దిన హెయిర్ స్టయిల్, హీల్డు శాండిల్స్- అచ్చం ఇందాక సినిమాలో షర్మిలా టాగోర్‌లా ఉంది.

అంతకన్నా ఆకర్షణీయంగా- వీధి దీపాల వెలుగుపడి ఆమె మెడలో రవ్వల నెక్లెస్ తళతళ మెరుస్తోంది. అది- ఆమె అందమైన కనుదోయికన్నా ఎక్కువ కాంతు లీనుతున్నది.

అతనికళ్ళు ఫ్లడ్ లైట్లు అయినాయి.

ఆమె తెగరొప్పుతోంది. ఆ రొప్పుడుకు వక్షస్థలం ఎగిరెగిరి పడుతున్నది.

తనని ఎవరో తరుముతున్నట్లు మాటి మాటికి వెనుకకు చూస్తూ, పరుగెడుతున్నంత త్వరగా అడుగులు వేస్తోంది. ముఖంమీద చిరు చెమటలుకూడా ముత్యాల్లాగే ఉన్నాయి. ఆ సెంటు ఏం పులుముకుందో గానీ- ఒకటే ఘుమ ఘుమ!

ఆమెకూడా అతన్ని చూసింది.ముందు —పెద్దపులేమో ననుకున్న దానిమల్లే కెవ్వున అరవబోయింది. సమాళించుకుంది. ఆ కేక సన్నటి మూలగై వెలుపలికి వచ్చింది ఆపాద మస్తకమూ గడ గడ వణికిపోతోంది

ముందతను కంగారుపడ్డాడు.క్షణంలో పరిస్థితిగ్రహించి నవ్వుకున్నాడు. ఇప్పుడు తను చెయ్యాల్సిం దేమిటో అతనికి స్ఫురించింది. అందుకనే దగ్గరి కెళ్లాడు.

ఆమె గట్టిగా కళ్ళు మూసుకుంది. "వద్దు....వద్దు....నన్నేం చెయ్యకండి... ప్లీజ్....మీకు దండం పెడతాను" అంటూ గొణుగుతోంది.

''నైస్'' అనుకున్నాడు. గొంతు సవరించుకున్నాడు. ఎంతో మర్యాదగా ''భయపడకండి! మీ రెవరు? ఇంత రాత్రిపూట, చలిలో ఎక్కడినించి రావటం?" అనడిగాడు.

ఆమె తేరుకుంది కొంచెం మాటలు చిక్కబట్టుకుని "కా....కాలేజీలో ఫంక్షనంటే ఆలస్యం అయింది. రి....రిక్షాలు కూడా దొరకలేదు. ఇల్లు దగ్గరేనని నడిచి వస్తుంటే అదో ఆ పెట్రోలు బంక మలుపుదగ్గర ఇద్దరు రౌడీలు....''చెప్పలేక భయంగా వెనక్కిచూస్తూ, ముద్ద ముద్దగా తడబడుతూ చెప్పింది. రవ్వల నెక్లెసు కళ్ళల్లో మెరవగా ''గుడ్'' అనుకున్నాడతను.

ఆమే మళ్లా చెప్పింది "నా కేంభయం లేదండీ! ఈ నెక్లెసు వుంది. అందుకని'' అక్కడికి తనేం భయపడటం లేదని తెలియచేస్తూ.

''అహా!" తనలో తనే భుజాలెగరేసుకున్నాడు పిట్ట వలలోకే ప్రయాణిస్తుంది. ఇవ్వాళ పొద్దున్నే లేచి ఏ సినిమా తార ముఖం చూసేదో గానీ, కష్టపడ్డా, చలి అయినా- అన్నీ లాభసాటి బేరాలే! ఇందాకా నోట్లబొత్తి! అదృష్టం బావుంది-



కొంచెంసేపు ప్రయత్నిస్తే నెక్లెస్.

అతనిబుర్ర చకచకా ప్లాను వేస్తుంది. "ఎక్కడిదాకా వెళ్ళాలి?" అనడిగాడు యదాలాపంగా.

"డిపో వెనకాల ఇల్లు."

"ఒంటరిగా వెళ్తారా?"

ఆమె ఏమీచెప్పలేదు. తల వొంచుకుని బొటనవేలు నేలకి వ్రాస్తూ నిల్చుంది కాస్సేపు. ఒక నిముషం తర్వాత "పోనీ మీరు వచ్చి దిగబెట్టరూ? ప్లీజ్!" అన్నది-గారాబంగా!

"లక్కీ!" అతని మనసు ఎగిరిగంతేసింది. ఎంత !మాడర్న్ ప్రవరాఖ్యుడయినా, అందమైన- షర్మిళాలాంటి ఆడపిల్ల-అందునా ఎంతో తియ్యగా, చనువుగా ఆ పైన ఒంటరిగా ఎదురయి-ప్లీజ్-అనంటే కరిగిపోకుండా ఉండలేదు.

ఆమె మళ్ళాఅంది-అతని ఇష్టాఇష్టాల నిమిత్తం లేనట్లు "తొందరగా నడవండి ఆ రౌడీలు వస్తారేమో?"

కాదని అనలేదు. రెండో కారణం -నెక్లెసు!

అంతలో ఎదురుగా ఖాళీ రిక్షా ఒకటి వస్తూంది. ఆమె అతనికి మరింతదగ్గరగా వచ్చేసి, "ఈ రాత్రి మనం ఇట్లా మాటలాడుకుంటుంటే ఎవరయినా చూస్తే గొడవ. పదండి.తొందరగా వెళ్ళిపోదాం" అన్నది. అని-రిక్షా ఆపి బేరమయినా ఆడకుండానే ఎక్కి కూచుని "రండి. ప్లీజ్!" అంది.

అతనికి మంచి చాన్స్ ఇది. ఒకటి వెచ్చగా కూర్చోనూవచ్చు. రెండోది తన పని తాను సానుకూల పరచుకోవచ్చు. ఇక హైదరాబాదు రిక్షాలు-ఇదిగో, ఇటు

వంటి వేళల్లో ఎంత సౌకర్యంగా ఉంటాయో చెప్పనే అక్కర్లేదు.

అతను పక్కనే కూర్చుంటే. ఓ పక్కకి సిగ్గుతో ఒరిగిపోతూ పువ్వులా ముడుచుకుపోయి. మోకాళ్ళమీద. చేతుల్లో మొహాన్ని దాచుకొని నవ్వింది. తనెంత ఆత్మరక్షణకోసం అలాచెయ్యటం తప్పక పోయినా పరాయి మగాడు పరాయే?

"షర్మిలా! షర్మిలా!!" అనుకున్నా డతను. అన్నిరకాల అదృష్టం కలిసివచ్చి నందున. పైగా తనంత ప్రయాసపడ కుండానే

రిక్షా సాగింది. చలిగాలి సాగింది. అతనిబుర్ర కూడా మరింతపని చెయ్య సాగింది. చలి ఎముకలు కూడా మిగల్చ కుండా కొరికేద్దామని తెగ ప్రయత్ని స్తోంది. ఆమె కొంగుతీసి నెత్తిన కప్పు కొంది. జానెడుపమిట తలదాటి భుజందాక కూడా రాలేదు. అయినా అతనదేమీ గమనించటం లేదు. నెక్లెసుని [illegible] చేస్తే చక్కాటి అమ్మాయిపక్కన [illegible] కూచోడం, శాస్త్రీని మైనస్‌చేస్తే నెక్లెసు ప్లస్సూ.... లెక్కలు వేసుకుంటున్నాడు.

ఏదో ఒకటి మాట్లాడాలని [illegible] "మీ రేం చేస్తారు!" అందామె.

"నేనా!" తడుముకున్నాడు. "ఏం లేదు. రోడ్లవెంట తిరగటం"

"ఉద్యోగం లేక ఎన్నాళ్ళయింది?"

"చాలా రోజులు."

ఆమె గలగల నవ్వింది. "మీరు తమాషా మనుషులు! కాని చాలా థాంక్స్! మీరు ఎదురవకుంటే ఏమయ్యేదాన్ని? పాపం మీకు శ్రమ"

"అబ్బెబ్బె! నా కేం శ్రమ! ఇది నా అదృష్టంగా భావిస్తాను. ఎప్పుడో ఏదో సినిమాలో డైలాగు చటుక్కున గుర్తు కొచ్చింది. అప్పుడే రిక్షా కుదిపింది. ఆ కుదుపుకు ఆమె అతనిమీద పూర్తిగా వాదిగిపోయింది. వెధవ చలి- ఎక్కడికి పోయిందో! ఈ రిక్షా ఇట్లా తెల్లవార్లూ పోతూనేవున్నా అతనలా కూర్చోగలడు. అతని చేతివ్రేళ్లు -అప్రయత్నంగా- ఆమె వొంటిమీదకు- చీరకూ! బ్లౌజుకూ మధ్య అచ్ఛాదన లేని మృదువైన శరీరంమీదకు ప్రాకినయి. వ్రేళ్ళల్లో- సురివెచ్చగా. లో వోల్టేజిలోని తిమ్మిరిలాంటి షాక్‌లా....

చాలీ చాలని కొంగు నెత్తిమీద జారి, భుజంమీదనుంచి ముందుకుపడిపోయింది.

"ఏమిటీ పని కోసంగా" అందామె.

ఆమె పూర్తోకాలేదు. రిక్షా ఆపమంది. "ఇల్లు వచ్చేసింది. ఇదిగో [illegible] సన్న గల్లీవుంది చూశారా. [illegible] ఇరుగ్గా ఉంటుంది. రిక్షా కూడా పట్టదు. నడుచుకుంటూ పోతే మా యిల్లే నండీ."

అతను తేలిగ్గా ఊపిరి తీసుకున్నాడు. రిక్షా ఆపి దభన చేస్తుందేమో, తనకుట్టు

కట్టయా-రెంటికి చెడిన రేవడనవుతానేమో నని భయపడ్డాడు.

అతనిఖర్మ మరింత వేగంగా పని చేస్తోంది. ఆమె చెయ్యి దాటిపోకముందే సాహసించాలి. రిక్షా దిగిపోతోంది....ఇహ ఏదయితే అదయిందనుకున్నాడు! వెంటనే అతని చేతివేళ్ళు ఆమె మెడవెనక మెరుపు దాడి చేసినయి. నెక్లెస్ లింక్ అయితే ఊడింది. పూడి-సరిగ్గా ఆమె దిగటానికి కాలు కిందపెట్టినప్పుడు—

ముందుకు వొంగాల్సి వుంటుంది గనుక వాళ్ళోపడి, కిందికి జారిపోయా వుంటే నేర్పుగానూ, వేగంగానూ లాగేసి, తన వెనక వేసుకుని అనుకునికూర్చున్నాడు,

''వస్తానండీ! చాలా థేంక్స్!'' అందామె కిందికి దిగి నిల్చుని,

''సందులో ఒక్కరూ వెళ్ళగలరా?'

''ఓ! మా వీధేకదండీఇది. ఆదివారం తప్పకరండి. ఇక్కడికివచ్చి ఎవరినడిగినా మా యిల్లు చూపిస్తారు" అక్కడికి-ఏ నేదో పాపులర్ స్టార్ అయినట్లు!

''రైట్! ఇహ వెడతాను" అన్నా డతను.

''థేంక్స్'' మరోసారి చెప్పి గల్లీ లోనికి వెళ్ళిపోయింది,

అతని గుండెకాయ మహ ఉల్లాసంగా కొట్టుకుంటున్నది. తన రెండు సంపాదనలు ఒకేసారి చూసుకుని ఆనందించా లని కూడా తగని ఆరాటంగా వుంది. అందుకే- ఆమె తనపేరడగకపోయినా, ఆమెపేరు తనకు తెలీకపోయినా, ఆమె చెప్పకపోయినా పట్టించుకోలేదు! అసలు అడగాల్సిన అవసరం కూడా ఏముంది?

రిక్షాను తొందరగా పోనిచ్చాడు— ఆమె మెడ తడుముకొని- గొడవ చేస్తుం దేమోనని, రిక్షా సందులు గొందుల్లో తి . గుతూ పోతున్నది.

* * *

పేక్ ఆవలిస్తూ చిటికవేస్తూ ''హరే రామ్!'' అన్నాడు. అతను ఆతృతగా చూస్తున్నాడు. దీపపు వెలుగులో నెక్లెసు ఆశాజ్యోతిలా మెరుస్తోంది.

మరి కాసేపు గీకీ గీకీ—''థూత్!'' అని నెక్లెసుని నేలకేసి కొట్టాడు! పైగా నిద్ర చెడగొట్టావని తిట్లకు లంకించు కున్నాడు.

'అరె ఫేకార్‌మడ్సి! నకిలీదెచ్చి గోల్ మాల్ చేస్తావా....''

అతనికి మరోసంగతేదో గుర్తొ . నట్లుంది గబుక్కున తన పాంటుజేబు . చేతులు పెట్టి చూసుకున్నాడు.

నోట్లబొత్తి ఖాళీ!!!

''అమ్మో నా డబ్బు'' అని అరవదా కి తన డబ్బయితే కద, తనదగ్గరుంటే కద

# చిన్నపిల్లలు - సందేహాలు

— వేమూరి సత్యనారాయణ.

'అమ్మా నాకాకలి లేదే - యిప్పుడు నాకేం వద్దు' అని పిల్లడనటంతో ప్రారంభమవుతుంది యుద్ధకాండ.

బలవంతాన తినిపించే ప్రయత్నం చేస్తుంది తల్లి. బలవంతాన ముద్దలు చేసి నోట్లో పెట్టి మింగమనటం. కొట్టబోవటం ఒక్కొక్కసారి వంటగది యుద్ధభూమిలా మారుతుంది. అటువంటప్పుడు భోజన సమయానికి తల్లిదండ్రులు గాని. పిల్లలు గాని ఉత్సాహంగా వంటగది వైపు రావటం జరుగదు. అంతేగాక యిదే విధంగా తరచూ జరుగుతున్నట్లయితే పిల్లలకు మన యింట్లో ఆరోగ్యకరమైన ఆహార పదార్థాలపై ఒక రకమైన ఏవగింపు గలిగి బజార్లో దొరికే అనారోగ్యకరమైన చిరు తిళ్ళ పైకి దృష్టి పోవటం జరుగుతుంది. ఇటువంటి పరిస్థితుల నుంచి తప్పించు కోవటం పెద్ద కష్టమైన పనేమీ కాదు. పెద్దలు కొంచెం ప్రయత్నిస్తే డైనింగ్ టేబిల్ చుట్టూ బిగదీసుకపోయిన ముఖాలు కాక, వికసించిన నవ్వులతో-సంతోషంతో ఉన్న మనుషుల్ని చూడవచ్చు.

భోజనం చేసేచోటు ఎలా ఉందీ అనేది ముఖ్యం, పిల్లలు సహజంగా సన్నిత మనస్కులు. శుభ్రంగా ఉన్న డైనింగ్ టేబిల్ (టేబిల్ కాకపోతే క్రిందయినా) భోజనానికి ముందు గాని. భోజన సమయంలో గాని తమ తమ సమస్యలు సృష్టించుకొని అక్కడ వాతావరణాన్ని బరువుగా మార్చెయ్యని పెద్దలు యివే పిల్లలను తిండివైపు ఆసక్తి చూపేలా చెయ్యగలిగేవి. 'అయ్యో, బిడ్డ సరిగా తినటం లేదే' అనే ఆదుర్దాతో పిల్లల మనసు తెలుసుకోకుండా బలవంతాన వారికి తిండి పెట్టే ప్రయత్నం చేస్తే, పిల్లలలో కూడా పట్టుదల పెరిగి అసలే తినమని పేచీ పెడతారు. హాస్యోక్తులతోనూ. సంతోషకరమైన సంగతులతోనూ నవ్వే ముఖాల మధ్యా భోజనం చేసే పిల్లలు హాయిగా భోజనం చెయ్యగలరు.

అలసిపోయి నిద్రకు సిద్ధమయిన సమయంలో పిల్లలకు భోజనం పెట్టి తినమని బలవంతం చేస్తే ఉపయోగం లేదు.... వారికి సరైన విశ్రాంతి కావాలి. విశ్రాంతితో పాటు అవసరమైనంత వరకూ ఆట పాటలూ కావాలి. పిల్లలను కొంతసేపు బయట ఆడుకోనివ్వాలి. అయితే ఆటల మధ్యనుంచి ఆదరా బాదరాగా పరుగెత్తు కొచ్చి దృష్టి అంతా ఆటలపై పెట్టుకొని భోజనం మీద ఆసక్తి లేకుండా ఉండేలా గాక ఆటలు ముగించి శుభ్రంగా కాళ్ళూ చేతులూ కడుక్కొని భోజనం చెయ్యాలనే దృష్టి ఉండేలా చెయ్యాలి పిల్లలకు.

చిన్న పిల్లలకు అందుబాటులో 'తీపి పదార్థాలు' ఉండనివ్వకూడదు. ముఖ్యంగా భోజన సమయానికి ముందు ఏ కొంచెం తీపి తిన్నా ఆకలిని విపరీతంగా తగ్గించేస్తుంది. పిల్లలు శోక్యం చేసుకొనేలా

సరైన పదార్థాలు, సరైన విధంగా వండి పెట్టాలి. బాగా వేయించిన కూరలూ, సులభంగా అరగని దుంపకూరలూ పిల్లలకు పెట్టవద్దు. తాజా పళ్ళు, కొంచెంగా ఉడికిన కూరలూ పిల్లలకు పెట్టాలి.

పిల్లలు తినగలిగినంతా ఒక్కసారీ ప్లేటులో పెట్టేసి తినమనడం కంటే— అందంగా అమర్చి కొంచెం పెట్టటంవల్ల మరీ మరింత తినాలనే కోరిక పుడుతుంది. దానివల్ల ఎక్కువ పెట్టినప్పుడు పిల్లలు కెలికి వదిలేసేలా జరగదు. అంతేగాక పిల్లలకు భోజనానికి రావాలంటే ఇదో ఆట కొస్తున్నట్లు చెయ్యాలి ... రంగు రంగుల అందమైన ప్లేట్లు, గ్లాసులు వాడితే పిల్లల మనసుపై ఎనలేని ప్రభావం తీసుకొస్తాయి. తినే పదార్థాల విషయంలో కూడా, వారికి పెట్టవచ్చు అనుకొనే పదార్థాలలో 'వారి కిష్టమైనవే' పెట్టడం మంచిది, అంతేగాని మన ఇష్టాయిష్టాలను వారిపై రుద్దకూడదు. ఉదాహరణకు పిల్లలకు కోడిగ్రుడ్డు పెట్టాలనుకున్నప్పుడు 'బాబూ! గ్రుడ్డు ఉడకేసి పెట్టనా, ఆమ్లెట్ వేసి పెట్టనా, పొరటూ వేసి పెట్టనా?' అని అడిగారనుకోండి తన కిష్టమైన విధం చెప్తారు పిల్లలు. దానివల్ల మనం పెట్టాలనుకొన్న పదార్థం పెట్టినట్లూ అవుతుంది, పిల్లలను బలవంతం చేసినట్లుగా కాక వారి కిష్టమైన పదార్థాలే పెట్టినట్లూ ఉంటుంది. వారికిష్టం లేని పదార్థాలు గొడవ జరగకుండానే తీసేయండి. ప్రొద్దున్నే పాలు వద్దన్నప్పుడు పిల్లలను కొట్టి తాగించటంవల్ల ఒకరోజు పని జరుగుతుందిగాని రోజూ గొడవే కదా! వాడు పాలు వద్దంటే అలాగే చేసి ఏ బోర్నవిటానో, మరొకటో వాడికిష్టం కలిగించేలా చేసి యివ్వాలి. ఒకవేళ అన్నీ రకాలుగానూ యిష్టపడకపోతే ఒక వారం రోజులు ఆ పదార్థం యివ్వడం ఆపెయ్యాలి. తర్వాత మళ్ళీ ప్రయత్నించాలి. సామాన్యంగా అదే పట్టు ఎల్లకాలమూ ఉండదు. మూడు సంవత్సరాల వయసులో సామాన్యంగా ఎక్కువ మంది పిల్లలు అంతకుముందు తినేదాని కంటే తక్కువ తింటారు. ఇది ప్రకృతి సహజం. మరీ పసి వయసులో పెరుగుదల ఎక్కువగా ఉంటుంది గనుక ఎక్కువ తింటారు.... ఇది గమనించక పిల్లలు తిండి తగ్గించేశారని గాభరా పడి వారికి బలవంతాన తినిపించే ప్రయత్నం చేస్తారు చాలా మంది తల్లులు. దానివల్ల భోజనం అంటే ఇష్టం తప్పిపోతుంది పిల్లలకు. కాబట్టి తెలివిగల పిల్లలు తినగలిగినంతవరకు 'బలవర్ధకమైన పదార్థాలు' యిచ్చే ప్రయత్నాలు చెయ్యాలి!

ఆరోగ్యకరమైన, సంతోషకరమైన పిల్లలెవ్వరూ కావాలని కడుపు మాడ్చుకోరు. వారు ఆకలితో ఉండి కూడా 'భోజనం మాకొద్దు' అని భోజనం మీద అయిష్టం పెంచుకున్నారంటే అది పెద్దల తప్పే. కాబట్టి పిల్లలకు ఆహారం యిచ్చే విషయంలో మన పెద్దరికం చూపి బలవంతం చెయ్యక తెలివైన మార్గాలతో, స్నేహపూర్వకంగా వారికి ఆహారాన్ని యివ్వాలి.

పిల్లల బరువు తగ్గటమో, లేక రెండు మూడు నెలల పాటు పెరగకుండా ఉండటమో జరిగినప్పుడు తప్ప వారు సరిగా తిండి తినటం లేదని గాభరా పడవలసిన పనిలేదు. అలా బరువు తగ్గటమో, పెరగక పోవటమో జరిగినప్పుడు వెంటనే డాక్టర్ను సంప్రదించి బిడ్డ వేరే ఏదైనా అనారోగ్యంతో బాధ పడుతున్నాడేమో తెల్సుకోవాలి!....

# మనసు జారితే

(కేంద్ర ప్రభుత్వ అవార్డు పొందిన నాటకం)

[గత సంచిక తరువాయి]

మనో: అలాగే. (శారదతో) ఏమండీ! మద్రాసులో మీ స్నేహితురాలికి ఏం ఉద్యోగం?

శార: టెలిఫోన్ ఆపరేటరేగా వుందండీ.

మనో: ఎక్కడుంటూంది?

శార: మైలాపూర్‌లో.

మనో: ఓహో! మీరు....

మధు: ఒరేయ్ మనూ! ఆ విషయాలన్నీ ప్రొద్దున్నే మాట్లాడుకోవచ్చుగావి. ఆమెకి

మనో. ఓ యస్. ఆఁ....ఏమండీ! మీరు పెట్టె-బేడా ఏమీ తెచ్చుకోలేదా?

శార. ఒక సూట్‌కేస్ తెచ్చానండీ. అక్కడి వుండి పోయింది.

మనో: అక్కడ? ఓ. రాజారావు యింట్లోనా? సరే. నేను వెళ్ళి తీసుకొచ్చేస్తా

మధు: ఇప్పుడెందుకులే. ప్రొద్దున్నే తెచ్చుకోవచ్చు.

మనో: పాపం, చీరైనా మార్చుకోకుండా ఎలా వుంటుందిరా! ఎంత సేపు. వుందిగా నా వాహనం! సైకిలు మీద స్పుట్నిక్‌లాగ వెళ్ళి బులెట్‌లాగ వచ్చేస్తాను. (పోటోయి తిరిగొచ్చి. శారదతో) ఏమండీ! మా మధుకి ఆడవాళ్ళంటే అనలే పడదండీ! ఎందుకో తెలుసా? చెప్తానుగా. వాళ్ళ అమ్మ పీడ్ని కవి. వెంటనే చచ్చిపోయిందంట. అదీ ఆమె చేసిన తప్పు. వీడి పుట్టుకే ఆ తల్లి చావుకు కారణమైందనుకోడు....

మధు: ఒరేయ్....

మనో: నో. కట్ చేయకు. అంచేత తల్లి ప్రేమంటే ఏమిటో వీడికి తెలీదు. పైగా, వీడికి ముందూ వెనకా సోదర-సోదరీమణులు ఎవరూ లేరు. ఒంటరిగా పెరిగాడు ఒంటి పక్షిలాగ! అదొక లోటు. ఇక, చిన్నప్పటి నుండి మీ ఆడవాళ్ళ లోపాలే చూస్తున్నాడు గాని. మంచి పీడి కంటికి కనిపించదంలా! అందువల్ల ఆడదంటే వీడికి ద్వేషం, భయం, క్రోధం, కామ....ఆఁ, కాదు-కాదు. కామ, లోభ, మద, మాత్సర్యాలు లేవు. వాటికి అతీతుడు.

మధు: వెళ్ళి ఆ సూట్‌కేస్ ఏదో త్వరగా తెస్తావా, లేక....

మనో: లేకపోవడం లేదు. తీసుకొచ్చే స్తున్నాను.

శార: ఆయన యిస్తారో....

మనో: ఇవ్వకేం జేస్తాడు. ఈ మనో హరుడు వెళ్ళడం. ఆఫ్ట్రాల్ ఒక లెదర్ సూట్ కేస్. ఏమండీ లెదర్ దేనా?

శార: (తలూపింది అవునన్నట్లు).

మనో: ఆఁ....ఒక లెదర్ సూట్ కేస్ తీసుకు రాలేక పోవడమూనా? ఛాంషేమ్! ఇప్పుడే నా సైకిలు మీద స్పుట్నిక్ లాగ వెళ్ళి బులెట్ లాగ వచ్చేస్తాను. (తొందరగా బయటికి వెళ్ళబోయాడు)

(పాట ముగిసే లోపలే. నిల్చున్న శారదతో)

మధు: నిల్చున్నారేం! కూర్చోండి.

శార: కూర్చుంటాను. కానీ, నన్ను బహువచనంతో పిలవకండీ.

మధు: క్షమించండి. నాకలవాటు లేదు.

శార: అది కాదన్నయ్యా! అలా పిలిచి దూరం చేయొద్దంటున్నాను. నన్ను నీ చెల్లెలిగా భావించలేవా అన్నయ్యా! నీ దయకి అర్హురాలిని కానా?

మధు: ఆఁ-అది కాదమ్మా. చెప్పాగా.

# రచన : విజయబాబు

[మధు. శారదలు ఏం మాట్లాడాలో. ఏం చేయాలో తెలియక యిబ్బంది పడ్తున్నారు. నేపథ్యంలో పాట వినిపించింది]

పాట చరణం-1.

ఎవరి మనసులో ఏమి తలపులో!
ఎవరి చేతలా ఏమి ఎత్తులో!
ఎవరు మంచియో, ఎవరు వంచకులో?
ఎవరి పంచన పంచుకుందురో!
ఎవరికి తెలుసు?
ఎవరికి తెలుసు. ఏ నరునికి తెలుసు
తెలిపిన వారెవరు-మర్మం—
తెలిపే వారెవరు?

అలవాటు లేదని! ఆఁ-కాస్సేపటిలో నీ సూట్ కేస్ తెచ్చినాక ఆ గదిలో నిద్రపో. రేపు నీ స్నేహితురాలి దగ్గరికి మద్రాసు వెళ్ళిపో.

శార: అలాగే అన్నయ్యా.

మధు: ఖర్చుకు డబ్బుందా!

శార: ఉందిలే అన్నయ్యా.

మధు: ఉందిలేనా! సరే, ఈ డబ్బు వుంచుకో అవసరానికి పనికొస్తుంది.

(పర్సు తీసి డబ్బు యిచ్చారు)

శార: తీసుకోవాలా అన్నయ్యా?

మధు: తీసుకోమనేగా యిస్తున్నది.

శార: ఈ డబ్బు తీసుకోవాలంటే ఒక షరతుకు నువ్వు ఒప్పుకోవాలి.

మధు: షరతా? ఏమిటి?

శార: నన్ను—నువ్వు—నోరారా 'చెల్లీ' అని పిలవాలి!

మధు: అదేంటి! నేను ఆ భావంతోనే యిస్తున్నానమ్మా!

శార: ఐతే పిలువన్నయ్యా! ఒక్కసారి చెల్లీ అను.

మధు: అలాగే-అలాగేనమ్మా!

శార: అలాగే కాదు. పిలువ్

మధు: అలాగే!

శార: (కన్నీళ్ళు తెచ్చుకుంటూ) అన్నయ్యా!

మధు: (బాధ పడ్తూ) చెల్లీ!

శార: (సంతోషంతో) అన్నయ్యా!

మధు: చెల్లాయ్!

[శారద, మధు చేతిలో డబ్బు తీసుకుని సంతోషంగా కళ్ళ కద్దుకుంది. మధు, ఆమె తల నిమిరాడు ప్రేమగా దగ్గరకి తీసుకుని. పాట నేపథ్యంలో వినిపిస్తూ వుంది]

పాట చరణం-2.

ఎవరు పతితులో, ఎవరు పావనులో!

ఎవరి తండ్రి ఎవరో!

ఎవరు అన్నయో, ఎవరు తమ్ముడో!

ఎవరి చెల్లె లెవరో!

ఎవరికి తెలుసు!

ఎవరికి తెలుసు. ఏనరునికి తెలుసు!

తెలిసిన వారెవరు?_బంధం.

తెలిపే వారెవరు!

(పాట ముగిసే లోపలే. మధుతో)

శార: అన్నయ్యా! నా అదృష్టం పండి నీ యింటి కొచ్చాను. నా ఆపద గట్టెక్కి నీలాంటి అన్నను పొంద గలిగాను. ఈ లోకంలో అనాధ నైన నాకు నా అనే వాళ్లు ఒకరు దొరికారని ఎంతో సంబర పడుతున్నాను. ఈ ఆనందాన్ని. అదృష్టాన్ని ప్రసాదించిన నీకు ఎంతగానో ఋణ పడివున్నా నన్నయ్యా?

మధు: (మాట మార్చుతూ) అఁ-రేపు తెల్లవారు ఝామునే ఎక్స్‌ప్రెస్ వస్తుంది. అందులో వెళ్తావా. లేక సాయంత్రం ఎక్స్‌ప్రెస్‌లో వెళ్తావా?

శార: (నిరుత్సాహ పడి) నీ యిష్టం అన్నయ్యా! ఎప్పుడు వెళ్ళమంటే ..

మధు: ఉదయం ఎక్స్‌ప్రెస్ లోనే వెళ్ళు త్వరగా చేరుకోవచ్చు. వెళ్ళిన వెంటనే నీకు ఉద్యోగం దొరకాలని కోరుకుంటున్నాను.

శార: దేంత్సు అన్నయా! ఉద్యోగం దొరికిన తర్వాత ఉత్తరం వ్రాస్తాను, జవాబు వ్రాస్తావు కదూ!




మధు: ఎందుకు వ్రాయను తప్పకుండా వ్రాస్తాను।

శార: నేనురమ్మని వ్రాస్తే, నువ్వొక సారి మద్రాసు వస్తావా అన్నయ్యా?

మధు: ఓయస్. తప్పకుండా.

శార: నెగ్‌లెక్టు చెయ్యకూడదు.

మధు: నో,నో నెవ్వర్

శార: మాట తప్పవు కదూ?

మధు: అలవాటు లేదు.

శార: ప్రోమిస్। (చేయి చాచింది.)

మధు: ప్రోమిప్। (చేయి వేశాడు ఆమె చేతిలో)

శార: చాల థేంక్సు అన్నయ్యా. అన్నయ్యా। నీకు నిజంగా ఆడ వాళ్ళంటే కోపమా?

మధు: ఆ సంగతి అడగొద్దమ్మాయి అరె పిడింకా రాలేంటి బులెట్ లాగ వస్తానన్నాడు। అలా కూర్చో అమ్మాయి.

శార। (కూర్చుంది కుర్చీపైన)

మధు: (పుస్తకం తీసుకున్నాడు)

శార: అన్నయ్యా।

మధు; ఊఁ?

శార: నువ్వు చదువుతున్నది...

మధు: ఎం. బి. బి. యస్ ఫైనల్.

శార: (సంతోషంగా) నువ్వు పెద్ద డాక్టరువై తల్లి దండ్రులు పేరు ... ఓ నీ కెవరు లేరని చెప్పారే మరి నీ చదువుకు, ఖర్చులకు ..

మధు: మా బాబాయి యిస్తుంటారు. ఆయన నన్ను కన్న కొడుకు కంటే మిన్నగా చూస్తూ వుంటారు. నువ్వన్నట్లు నేనే మైనా పేరు తీసుకు రాగలిగితే అది

మా బాబాయికే తీసుకు రావాలి.

శార: ఆయన ఎక్కడున్నారు?

మధు: విజయవాడలో

శార: బాబాయికి పిల్లలు లేరా?

మధు: ఉన్నారు ముగ్గురాడ పిల్లలు, ఒక మగవాడు . కానీ నేనంటేనే ఆతనికిఅమితమైన ప్రేమ చాలీచాలని జీతంతో గుమాస్తా ఉద్యోగం చేస్తూ, నా ఉన్నతి కోరి డాక్టరీ చదివిస్తూ నన్నొక మనిషిగా.. బాబాయి ఋణం ఈ జన్మలో తీర్చలేను మా యింట్లో పిన్నితో కూడా పోట్లాడుతూ వుంటాడు.

శార: ఏం? పిన్నికి నువ్వంటే యిష్టం లేదా?

మధు: కన్న పిల్లలపై వున్న ప్రేమ పరాయి వాడినైన నా మీద ఎందుకుంటుంది? అది సహజమే కదా?

శార: సహజమని సమర్థించి కన్నయ్యా! అది స్త్రీ జాతి దౌర్బల్యం. మాకు మీలా విశాల దృక్పథం అలవడదు మా భావాలు చాల సంకుచితంగా వుంటాయి.

మధు: మీ జాతిని నువ్వే కించ పరుస్తున్నావే

శార: యదార్థం అంతే అన్నయ్యా!

(మనోహర్ డేంజర్! డేంజర్! అంటూ ఒగర్చుకుంటూ వచ్చి)

మనో: మధూ! ఒరేయ్..

మధు: ఏమిటి? ఏమైంది?

మనో: బాంబ్! హైడ్రోజన్ బాంబ్ ప్రేల బోతోంది!

మధు: బాంబేమిటిరా? నీన్నుట్నీకలో బాంబ్ వుందేంటి పొరపాటువి?

మనో: పొరపాటు కాదురా, మన గ్రహపాటు వచ్చేస్తున్నారు!

మధు; ఎవరు? మళ్ళీ రాజారావా?

మనో: కాదురా మీ బాబాయి రాబో తున్నాడు.

మధు: ఆఁ!

మనో: రాబోవడమేంటి, వచ్చేశాడు. కాస్సేపటిలో యిక్కడి కొచ్చేస్తాడు. యిప్పుడు రాజారావు యింట్లో వున్నాడు.

మధు: రాజారావు యింట్లోనా.

మనో: అవును సూట్ కేస్ కోసం బయలు దేరి వెళ్ళానా? దారిలోనే మన మహేష్‌గాడు ఎదురై "మన మధుగాడు ఎవరో బ్యూటీఫుల్ బ్యూటీని తీసు కొచ్చాడటగా ఈ విషయం యిప్పుడే చెవులారా విన్నాను. కన్నులారా చూద్దామని బయలు దేరాను" అన్నాడు. నీ కెవరు చెప్పార్రా అని అడిగాను "మన రాజారావే చెప్పాడు నిద్ర పోతున్న వాణ్ణి లేపి మరి చెప్పి వెళ్ళాడు' అన్నాడు "అయితే నీ పంతం గెలిచావని బయలు దేరా వన్నమాట!" అన్నాను. "అది

నిజమైతే నేను ప్రయత్నించ కుండానే గెలిచాననిన ంతోషిస్తాను" అన్నాడు.

"అక్కడికివెళ్తే ఏడుస్తూ తిరిగొస్తావు వెళ్ళొద్దని" జరిగినసంగతంతా చెప్పాను. "వెధవ, నా విద్రంతా పాడు చేశాడు" అని రాజారావుని తిడుతూ వెళ్ళిపోయాడు. ..క, రాజారావు ఇంటి కెళ్ళేసరికి లోపల (ఆగిపోయాడు).

మధు: ఊఁ

మనో: లోపల మీ బాబు, రాజారావు కూర్చుని మాట్లాడుతూ వున్నారు. తప్ప కుండా ఈ అమ్మాయి సంగతే చెబుతూ వుంటాడు, మహేష్‌తో అబద్ధాలు చెప్పిన వాడు మీ బాబుతో చెప్పడా? మీ బాబాయి వచ్చి యిక్కడ ఈమెని చూశాడంటె-అంతే-కొంప ము ని గిం దన్న మాటే. అందుకని సూట్‌కేస్‌కోసం లేటు చెయ్య కుండా స్పుట్నిక్ లాగ బయలుదేరి బులెట్ లాగ వచ్చేశాను.

మధు: బాబాయి ఈమె నిక్కడచూస్తే తప్పుగా ఊహిస్తాడా?

మనో: రాజారావు మాటలు తలకెక్కి వుంటే తప్పకుండా తప్పుగా భావిస్తాడు.

మధు: అంతేగాని మనం చెప్పిన మాటలు నమ్మడంటావా?

మనో: ఎందుకైనా మంచిది. అతను

వచ్చేటప్పటికి ఈమెని లోపల టిక్కెడై నా దాచే స్తే మంచిదిరా.

మధు: లోపల! మన కీ రెండుగదులు తప్ప వేరేలోపల ఎక్కడుందిరా! అయినా ఎంతసేపు దాస్తావు? విజాన్ని దాచడం నా చేతకాదు. రానీయ్. వచ్చి నిజం తెలుసు కోనీయ్.

మనో: నువ్వుచెప్పేది నిజమేరా, కానీ యిది నిజమని అతను అనుకుంటేగా!

మధు: అనుకోడని అబద్ధంఆడాలా!

మనో: అది కాదురా, ఎదీ చెప్ప కుండా నే ...

మధు: ఒరేయ్! ఒక్క బాబాయికి నిజంచెప్పి నమ్మించలేని మనం రేపు లోకాన్నంతా ఎలా నమ్మించగలంరా?

మనో: అవీ నిజమేరా, ఈ నిజంతో పెద్ద పేచీరా! సరే, అతను నమ్మేటట్లు చెప్పు ఆ నిజాన్నేదో మీ బాబాయికి కోపం వస్తే డేంజర్!

మధు: ఏం పర్వాలేదు. బాబాయి రానీయ్, అన్నివిషయాలూ చెప్పి, అతని కళ్ళముందే ఈమెని రేపొద్దున్న ట్రెయి నులో పంపించేస్తే అతని కే అనుమానం వుండదు.

మనో: రేప్రొద్దున్నే! అప్పుడే ఏంరా? కొద్ది రోజులు వుండి వెళ్ళనీరా పాపం

మధు: ఆమె ఉద్యోగంకోసం మద్రాస్ వెళ్తున్నానని చెప్పింది. మరిచిపోయావా?

మనో: మెయిల్ప్రేకేగా! ఎప్పుడువెళ్తే ఏముంది లెద్దూ? అయినా పరిచయాలైనా సరిగ్గా కాలేదు. ఆమెపరిస్థితీ అదీ తెలుసు కుని మనచేతనైన సహాయం చెయ్యొద్దూ! చెల్లెలని రాజారావుతో పోట్లాడావే. ఇదేనా చెల్లెలిమీద ప్రేమ?

మధు: అదికాదురా, ఆమే వెళ్తానం టూందిగా.

మనో: నో, నో, నే నొప్పుకోను. (శారదతో) ఏమండీ! కనీసం వారంరోజు లైనా యిక్కడవుండి వెళ్లాల్సిందే. (మధుతో) ఒరేయ్! నీకు భయమైతే చెప్పు! నేను మా యింటికి తీసుకెళ్తాను. మా అమ్మ....

మధు: ఆc- ఎందుకూ! ఉండా లను కుంటే యిక్కడే వుండనీయ్.

మనో: వెరీగుడ్! ఆc శారదగారూ! దయచేసి; మాపై దయచూపి, ఎట్లీస్టు వన్ మంత్ అయినా యిక్కడుండి. మా ఆతిద్యాన్ని స్వీకరించి, మమ్మల్నానందింప జేయ గోరుతున్నాను. ఇట్లు. భవదీయుడు మనోహర్.

శార: మీ దయకీ చాల థేంక్సు కానీ నావల్ల మీకు యిబ్బంది కలుగుతుందేమో నని....

మనో: మీరేం బాధపడకండి. వాళ్ళ బాబాయిని ఒప్పించడానికి బాధపడాల్సింది వాడు ఆ తర్వాత అన్నిబాధలూ భరించ డానికి నేను సిద్ధంగానే ఉన్నాను!

శార: (మధుతో) ఏం అన్నయ్యా! నేను ప్రస్తుతం ఎక్కడున్నా ఒకటే. నీకు కష్టం కలగకపోతే....

మనో: చెల్లె లుంటానంటే అన్నయ్య వద్దంటాడా? ఏంరా మధూ!

మధు: నాకేం కష్టం. కానీ....

మనో: కానీలూ, [అణాలూ ఏ నాడో పోయాయి! యిప్పుడన్నీ నయా పైసలే గాని. అన్ని విషయాలు నే చూసుకుంటాను. నువ్వేం బాధపడకు.

మధు: సరే. నీ యిష్టం. మరి బాబాయి వస్తే....

మనో! (బయటికి చూచి) అదిగో మాటమీదే వచ్చేస్తున్నారు.

(మధు తిరిగిచూసి ఎదురెళ్లాడు. రఘు రామయ్య ప్రవేశించాడు.)

మధు: ఏంబాబాయి యింత రాత్రివేళ వచ్చావు! ట్రెయిన్ లేటా? ఉత్తరం రాసుంటే స్టేషన్ కొచ్చేవాడ్నిగా!

మనో: నమస్కారం రఘురామయ్య గారూ!

[రఘురామయ్య చాల సీరియస్‌గా ఎవరికీ జవాబు చెప్పకుండా శారదదగ్గరి కెళ్ళి కొద్దిక్షణాలు చూసి, అటూ యిటూ రెండడుగులు వేసి]

రఘు: బేడ్ వెరీవెరీ బేడ్!

మధు: బాబాయి....

రఘు: మధూ! యిదా నువ్వు చదువుకుంటున్న చదువు! బుద్ధిమంతుడి వనుకున్నాను, శ్రద్ధగా చదివి అభివృద్ధికొస్తా వనుకున్నాను. చివరికి నువ్వు చేస్తున్న పని యిదా?

మధు: బాబాయి! నే నే తప్పుచేయ్య ..

రఘు: కనిపిస్తూనే వుంది. యిప్పుడే నీ డియరెస్టు ఫ్రెండ్ రాజారావు కనిపించి నువ్వుచేస్తున్న ఘనకార్యాలన్నీ వివరంగా వినిపించాడు. అతనిమాట కూడా పెడ చెవినిపెట్టి యిటువంటి గొప్ప పనులు చేస్తున్నందుకు, యింత అభివృద్ధిలోకి వస్తున్నందుకు చాల సంతోషం మధూ!

మధు: బాబాయి! నే చెప్పేది........

రఘు: ఇంక నువ్వేం చెప్పాల్సిన అవసరం లేదు. నీ అసలు స్వరూపం తెలుసుకున్నాను. ఇన్నాళ్ళూ నీ గురించి ఊహించుకున్నవన్నీ పొరపాటని గ్రహించాను. మీ పిన్ని మాటలు వినకుండా నిన్ను చేరదీసి ఆదరించినందుకు తగిన శాస్తి చేశావు. చాల సంతోషం. ఇక నీ ఆల్లాలకు ఏ అడ్డంకీ వుండదు. నే వెళ్తాను. నువ్వు స్వేచ్ఛగా ప్రవర్తించు.

మధు: బాబాయి....

రఘు: నువ్వేం చెప్పినా నే వినదలచుకో లేదు.

మనో: రఘురామయ్యగారూ! మధు చెప్పేది వినండి. అతను ఏ నేరమూ చేయలేదు. నిజం తెలుసుకోకుండా మీరు ...

రఘు: నువ్వు వాడిని వెనకేసుకు రావొద్దు. నిజమేదో అబద్ధమేదో నాకంతా తెలుసు.

మనో: అనుకొని పొరపడుతున్నారు. కానీ మీకు నిజం అవగింజంతయినా తెలీదు.

రఘు: ఆఁ.

మనో: కోప్పడొద్దు. మధు చెప్పేది సావధానంగా వినండి. మీకు డౌట్సు వుంటే నన్నడగండి. నే క్లియర్ చేస్తాను.

రఘు: రాజారావు చెప్పిందంతా అబద్ధమంటావా?

మనో: సెంట్ పర్సెంట్! అఁ.... మీ౦తకీ ఏం చెప్పాడు?

రఘు: ఏం చెప్పాడనుకుని సెంట్ పర్సెంట్ అబద్ధమన్నావు?

మనో: ఈ రోజు వాడు ఏం చెప్పినా అంతా అబద్ధమే! ఫాల్స్. ఎందుకంటే ఫుల్‌గా తాగి వున్నాడు.

రఘు: అతనితో పాటు నేనూ తాగే వచ్చానంటావా? కళ్ళ ముందు కనిపిస్తున్న సత్యాన్ని కాదని నమ్మమంటావా?

మనో: మీకు కనిపిస్తున్న ఆ సత్యం మీటో చెబితే అది అవునవునమో-కాదనమో .

రఘు: ఈ అమ్మాయి ఎవరు?

మనో: మధు చెల్లెలు.

రఘు: ఓహో! నాకే తెలియకుండా వాడికొక చెల్లెలుందన్న మాట!

మధు: నాకూ తెలియదు బాబాయి. ఇప్పుడే తెలుసుకున్నాను.

రఘు: ఆఁ....అంటే!

మధు: కొద్ది క్షణాల క్రితం వరకూ ఆమెకూ, నాకూ ఏ సంబంధమూ లేదు. ఆమె ఎవరో, ఎలాంటిదో, అసలామె ముఖమ్మూ మొహమే ఎరగను. కానీ, రాజారావు బలాత్కరిస్తే తప్పించుకుని యిక్కడికొచ్చింది.

మనో: మధు ఈమెని రాజారావు బారి నుండి కాపాడాడు.

మధు: ఆమె నన్ను అన్నయ్యగా భావించుకుంది.

మనో: మధు ఈమెని చెల్లెలిగా స్వీకరించాడు.

రఘు: వెరీగుడ్-బాగుంది మీ కల్పన!

మధు: నే చెప్తున్నది నిజం బాబాయి! రాజారావు మీతో చెప్పిందంతా అబద్ధం.

మనో: మీతోనే కాదు. మా ఫ్రెండ్ మహేష్‌తో కూడా యిలాగే చెప్పాడు. వాడిప్పుడే వచ్చి నిజం తెలుసుకుని వెళ్ళాడు.

రఘు: సరే. అయితే ఈమెని వెంటనే యిక్కడి నుంచి పంపించేయండి.

మధు: బాబాయి!

రఘు: నే విన్నది అబద్ధం. నువ్వు

చెప్పేది నిజం అయితే. నే చెప్పినట్లు చెయ్.

మధు: అది కాదు బాబాయి. ఈ అర్ధ రాత్రప్పుడు....

రఘు: మరేం ఫర్వాలేదు. ఈ రాత్రికి ఏ లాడ్జిలోనో వుంటుంది.

మధు: ఒంటరి ఆడపిల్లవి-ఇంత రాత్రి వేళ—లాడ్జిలో వుంచడం....

రఘు: ఏం భయం లేదు. అక్కడ అక్కడ దొంగలెవరూ ఎత్తుకు పోరులే! అలాంటి వారికది అలవాటే!

మధు: అంత కఠినంగా మాట్లాడకు బాబాయి! నా చెల్లెలు నా యింటికొస్తే ఆద రించకుండా లాడ్జిలో వుంచేంత పరిస్థితికి దిగజారమంటావా? అలా చెప్పడం నీకు న్యాయమా?

రఘు: అయితే నేను కఠినుణ్ణి, నే చెప్పేది అన్యాయమనీ అంటావు?

మధు: అది కాదు బాబాయి ఆమె కెవరూ లేరు? రాజారావు మోసం చేస్తే నా దగ్గరికొచ్చి అన్నయ్యా అని పిలు స్తుంది. నేనామెను చెల్లెలిగా స్వీకరించాను. బాబాయి! ఆడది-మగవాడు మధ్య ఎప్పుడూ ఒకే సంబంధమే గాని పవిత్రమైన అను బంధం వుండదా? ఆమెని చెల్లెలిగా చేర దీయడం పాపమంటావా?

రఘు: పాపమో, పుణ్యమో నాకు తెలీదు. ఈమెని నువ్వు వెంటనే పంపిం చడమే మంచిది.

మధు: నా చెల్లెల్ని అర్ధ రాత్రివేళ లాడ్జికి పంపించడమే మంచిదయితే ఆ మంచి నాకక్కరలేదు బాబాయి! నా మన స్సుకు వచ్చిన విధంగా నిర్ణయించుకుని పడుకుంటున్నాను. అందుకు వ్యతి రేకంగా....

రఘు: అయితే నేను చెప్పేది విన వన్న మాట!

మధు: క్షమించు బాబాయి. ఈ ఒక్క విషయంలో...

రఘు: అవునులే! అడవి ప్రక్క నుంచే నాలాంటివాళ్ళ మాటలకు పోటుం దదు.

మధు: బాబాయి!

రఘు: నా మాటకు విలువ లేని చోట వుండడం నాకు చేతకాదు. వస్తాను.

మధు: బాబాయి! నీకు విలువ లేక పోవడం ఏమిటి? నా విషయం పూర్తిగా తెలిసి కూడా.

రఘు: ఇప్పుడే తెలుసుకున్నాను, పూర్తిగా!

మనో: రఘురామయ్యగారూ! మీరు తొందర పడుతున్నారు మధు ఏ తప్పూ చేయలేదండీ. ఆ రాజారావే అంతటికీ కారణమండీ ...

రఘు: అవును. నీ కూడా నా యింటిలో వాటా వుంది, అంతకంటే యింకేం చెప్తావు!

మనో: (షాక్ తిని) ఏమంటీ మీరు .

రఘు; నువ్వేం సమర్థించాల్సిన అవ సరం లేదు. వాడికి నాకంటే ఈ అమ్మాయే ఎక్కువని తెలుసుకున్నాను. ఈమెనొక్క విలువ నాకు లేనిచోట వుండడం నాక్కూ లేదు. ఆ అమ్మాయీ, మీరే వుండండి నే వెళ్తాను.

[ఇంకా శేషం]

# మేధావులు - మతిమరుపు

మహా మేధావులు, శాస్త్రవేత్తలు కూడా చాలా సందర్భాల్లో పరధ్యానకు లోనైనవారే. పుస్తకపఠనంలోనో శాస్త్ర పరిశోధనలోనో చిత్తం పూర్తిగా హత్తుకున్నందువల్లనే తక్కిన ప్రపంచాన్ని మరచిపోవడం తటస్థిస్తుంది. ధ్యాస ఒక దానిపై పూర్తిగా లగ్నమైనందునే తక్కిన అన్నింటిపట్ల పరధ్యాస ఏర్పడుతుంది.

(1) మహా శాస్త్రవేత్త సర్ ఐజక్ న్యూటన్ ఒకసారి కోడిగుడ్డును సరిగా రెండు నిముషాలే ఉడకనివ్వాలనుకొని గడియారాన్ని పొయ్యిపైకి ఎక్కించి కోడిగుడ్డును చేత బుచ్చుకున్నాడట.

(2) ప్రసిద్ధ వేదాంతి, రచయిత జార్జి బెర్నార్డుషా ఒకనాడు నలుగురు మిత్రులను పిలిచి విందుచేస్తూ 'వైన్' తెస్తానంటూ వెళ్లి, వేరేఆలోచనలో పడిపోయి విందును, దానికివచ్చినవారిని మర్చిపోయి చర్చికి వేళయిపోయిందనివీధిలోకి చక్కాపోయాడట.

(3) ప్రఖ్యాత రచయిత ఆలివర్ గోల్డుస్మిత్' ఎడింబరోలో డాక్టరీ చదవడానికి వెళ్ళినపుడు, పెట్టె బేడా ఒక హోటల్‌లో పెట్టించి షికారుకు బయలుదేరాడు. చిమ్మచీకటి పడేవరకు తిరిగిన తర్వాత ఇక బసకు చేరుదామనుకుంటే, ఆ వీధిపేరు, ఆ హోటల్‌పేరు ముందు అసలు విచారించివుంటేనా?

(4) ప్రముఖ శాస్త్రవేత్త డాక్టర్ సర్ సి. వి. రామన్ శాస్త్రపరిశోధనలో నిమగ్నమై భోజనం మొదలు పెట్టకుండానే చేతులు కడిగి లేచిపోయిన సందర్భాలెన్నో!

(5) మహా మేధావి, ప్రాచీన కాలపు ఖగోళ శాస్త్రజ్ఞుడు థేల్స్, చిన్నతనంలో నక్షత్రాల వంక తదేకంగా చూస్తూ, మురుగునీళ్ళ గుంటలో బోర్లగా పడినందుకు కడుపు చెక్కలయ్యేట్టు నవ్వి— "నీ కళ్ళ ఎదుటవున్న వాటిని కానలేని నువ్వు చుక్కలను చూసి ఏమి తెలుసుకుంటావురా?" అని హేళన చేశారట చుట్టూ వున్నవాళ్ళు.

(6) ప్రసిద్ధ రచయిత టాల్‌స్టాయ్ ధూమపాన ప్రియుడు. సిగరెట్ ముట్టించి ఆ వెంటనే పరాకుగా పారవేసి కొత్త దాన్నిముట్టించడం, కాలుతున్న సిగరెట్‌ను కోటుజేబులో వేసుకుని ఒళ్ళు కాల్చుకోవడం జరిగిన సందర్భాలనేకం.

(7) ప్రసిద్ధ గ్రీక్ గణిత శాస్త్రవేత్త ఆర్కిమెడిస్ రేఖా గణితంలో తలమునకలౌతూ అన్నపానీయాల మాటే మరచిపోయేవాడు. బలవంతంగా స్నానాగారాలకు లాక్కువెడితేనే తప్ప స్నానమైనా చేసేవాడు కాదు. అక్కడైనా తలంచుకుంటూ, నూనె పట్టించబడిన తన ఒంటిమీద త్రిభుజాలూ, చతుష్కోణాలూ గీసుకుంటూ వుండేవాడు.

ప్రముఖ రచయిత చెకోవ్, పోస్టు బిళ్ళలను డబ్బాలో వేసి ఉత్తరాలను భద్రంగా వెనక్కి తెచ్చిన సందర్భాలనేకం.

అంగర కృష్ణారావు



## లోక మాత 'మేరీ మాత'

''లోక మాత మేరీ మాత'' తమిళ నాడులో ''వేలాంగణ్ణి'' గ్రామములో వెలసియున్నది. అనాథల పాలిటి దేవత యీమె. 'అమ్మా' అని నోరారా పిలిస్తే ఆదరించకుండా వుండలేదు. చూపు పోయిన వారికి చూపు నిచ్చింది. కాళ్ళు లేని వారికి కాళ్ళు యిచ్చింది. నమ్మకం లేని వారిని నమ్మించింది. చల్లని చూపు చూసింది.

తమిళంలో ''అన్నై వేలాంగణ్ణి'' పేరుతో నిర్మింపబడి ప్రముఖుల ప్రశంస లందుకొన్న ఈ చిత్రంలో నేటి యుగానికి చెందిన చిన్న-చిన్న కథలు కూడా వున్నాయి. అవి వాస్తవానికి దూరం కాకుండా ఎంతో చక్కగా చిత్రీకరింపబడినాయి. మేరీ మాత పై నమ్మకము లేని వారికి కూడా నమ్మకం కలిగేట్లు దర్శకులు శ్రీ తంగప్పన్ ఎంతో చక్కగా రంగులలో యీ చిత్రాన్ని నిర్మించారు. ఈ చిత్ర నిర్మాణ సమయంలో ఎంతో శ్రమ పడవలసి వచ్చిందని కూడా తెలియవస్తుంది.

శ్రీ వెంకటేశ్వర ఆర్టు ఫిలింస్ బ్యానర్‌లో నిర్మాత శ్రీ జి. మాధవరావు నిర్మించిన యీ చిత్రంలో జయలలిత, పద్మిని, కె. ఆర్. విజయ, దేవిక, విద్య, మనోరమ, శకుంతల, జెమినీ గణేశన్, నాగేష్, ముత్తురామన్, సుందరరాజన్, శ్రీకాంత్, విన్సెంట్, మాస్టర్ మురళి, మాస్టర్ శేఖర్ మున్నగువారు నటీనటులు.

ఈస్ట్‌మన్ కలర్లో నిర్మితమైన యీ చిత్రానికి పాటలు, మాటలు: రాజశ్రీ; సంగీతం: దేవరాజన్; ఛాయ: జి. కె. రాము; స్క్రీన్‌ప్లే, రచన, దర్శకత్వం, నిర్మాణం: శ్రీ కె. తంగప్పన్ నిర్వహించారు. ప్రెస్ రిలేషన్స్ అండ్ పబ్లిసిటీ లక్ష్మీ ఎడ్వర్‌టైజర్స్.

ఆంధ్ర: సోల్ డిస్ట్రిబ్యూటర్స్ లక్ష్మీ కంబైన్స్; ఆంధ్ర: లక్ష్మీ ఫిలింస్; సీడెడ్: నవభారత్; నైజాం: తారకరామా ఫిలింస్.

## రైతు కుటుంబం

నవభారత్ మూవీస్ వారు నిర్మిస్తున్న ''రైతు కుటుంబం'' చిత్రం పూర్తయింది. ఈ చిత్రంలో సంగీత దర్శకులు టి. చలపతిరావు సంగీత సారథ్యంలో ఎనిమిది చక్కటి పాటలున్నాయి. రెండు పాటలను కలర్‌లో చిత్రీకరించారు. విడుదలకు సిద్ధంగా వున్న యీ చిత్రంలో



'మేరీమాత'లో జయలలిత

---

నాగేశ్వరరావు, కాంచన, పద్మనాభం, రామకృష్ణ, సత్యనారాయణ, ధూళిపాళ, అంజలీదేవి, గీతాంజలి, సూర్యకాంతం, అనిత ముఖ్య పాత్రధారులు. అతిధి నటులుగా విజయలలిత, కృష్ణంరాజు, నాగయ్య పాల్గొన్నారు.

ఈ చిత్రానికి దర్శకుడు తాతినేని రామారావు; నిర్మాతలు: పి. వి. సుబ్బారావు, పి. యస్ ప్రకాశరావుగారలు. నిర్వహణ: ఏ. పూర్ణచంద్రరావు; విడుదల: లక్ష్మీ ఫిలింస్; ప్రెస్ రిలేషన్స్ అంద్ పబ్లిసిటీ: లక్ష్మీ ఎడ్వర్‌టైజర్స్.

## సంచలన చిత్రంగా భానుమతి చిత్రం

పద్మశ్రీ భానుమతిగారి దర్శకత్వాన కొత్త తరహాలో నిర్మింపబడుతున్న భరణీ పిక్చర్స్ 10వ చిత్రం షూటింగ్ నవంబరు 2 నుండి మూడు రోజులు నిర్విరామంగా జరిగింది.

"వరాన్నొసఁగు మేలవమ్మా" పాటను శ్రీమతి భానుమతి కర్ణాటక బాణీలో పాడగా ఆమెపైనే నేత్రపర్వంగా చిత్రీకరించడమయింది.

పద్మనాభం, ధూళిపాళ, ఛాయాదేవి, నూతన తారలు మాలతి, రాజలక్ష్మి పాల్గొన్న కొన్ని సన్నివేశాలను దర్శకురాలు శ్రీమతి భానుమతి ప్రతిభావంతంగా సెల్యులాయిడ్‌పై మలిచారు.

అనాధ శరణాలయం సెట్‌పై — నవంబరు 16 నుండి మూడు రోజులు షూటింగ్ జరిగింది. ఈ సెట్‌పై శ్రీమతి భానుమతి పసిపాపను జోకొడుతూ పాడిన లల్లబీ చిత్రీకరణ ఈ చిత్రంలో మరో హైలైట్.

సూర్యకాంతం, ఛాయాదేవి, మోహన, ధూళిపాళ మొదలగు వారు పాల్గొన్న ఒక హాస్య సన్నివేశాన్ని కూడా చిత్రీకరించారు.

చిత్రంలోని ప్రతి ఫ్రేమ్‌లో నూ

నవ్యత్వం పుట్టిపడేలా - శ్రీమతి భానుమతి ఎంతో శ్రద్ధగా, నైపుణ్యంగా దర్శకత్వం నెరపుతున్నారు.

ఈ చిత్రంలోని డి. వి. నరసరాజు గారి సంభాషణలతో బాటు - శ్రీమతి భానుమతి మార్పులు-చేర్పులు చేస్తూ 'మట్టిలో మాణిక్యం' వలెనే చక్కని హాస్యం, పదునైన వ్యంగ్యం కూర్చుతున్నారు. ఇది యీ చిత్రంలోని మరో ప్రత్యేకతగా భావిస్తున్నారు.

తరువాతి షూటింగ్ షెడ్యూలు నవంబరు 27 నుండి 30 వరకు, డిసెంబరు 1 నుంచి 4 వరకు జరిగినాయి. కొన్ని ప్రధాన సన్నివేశాలను చిత్రీకరించారు.

తారాగణం: భానుమతి, కృష్ణ, నాగభూషణం, నాగయ్య, మిక్కిలినేని, కృష్ణంరాజు, ధూళిపాళ, సాక్షిరంగారావు, పద్మనాభం, కుమారి టి. పద్మిని, సూర్యకాంతం, ఛాయాదేవి, నూతన నటి రాజ్యలక్ష్మి మొదలగు వారు.

కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: భానుమతి; సంగీతం: భానుమతి, సత్యం; ఛాయ: లక్ష్మణ్‌గోరే; స్టూడియో: భరణి; విడుదల: సవయుగ.

## మొనగాడొస్తున్నాడు జాగ్రత్త!!

రవిచిత్ర ఫిలిమ్స్ యూనిట్ నవంబరు నెలలో ఏకబిగిని, ఇరవై రోజుల పాటు అవుట్‌డోర్ షూటింగ్ జరిపారు. ఈ షెడ్యూలుతో, ఈస్ట్‌మన్ కలర్లో నిర్మించబడుతున్న "మొనగాడొస్తున్నాడు జాగ్రత్త!" షూటింగ్ కార్యక్రమం ముగిసింది. ఫైనల్ ఎడిటింగ్ జరుగుతోంది.

చెంగల్పట్టు సమీపంలో అరు కొండల మధ్య, డెబ్బై అయిదువేల రూపాయల ఖర్చుతో, భారీ ఎత్తున వీధి సెట్ నిర్మించి, అక్కడ షూటింగ్ జరిపారు. హాలీవుడ్ చిత్రాలను మరిపించే వాస్తవికత, ఘనత ఆ సెట్‌లో వున్నాయని, చూసిన వారంతా కొనియాడారు.

ముఖ్య తారాగణం: కృష్ణ, సత్య



'మేరీమాత'లో దేవిక

నారాయణ, ప్రభాకరరెడ్డి, త్యాగరాజు, జ్యోతిలక్ష్మి, రాజసులోచన ఆ సెట్‌లో పాల్గొన్నారు.

కావేరినదీ తీరంలో కొన్ని దృశ్యాలు, హోగన్‌కల్ జలపాతాల వద్ద మరికొన్ని దృశ్యాలు రమణీయంగా చిత్రించ బడ్డాయి.

నిర్మాత వై. వి. రావ్, "మొనగాడొస్తున్నాడు జాగ్రత్త." చిత్రాన్ని సంక్రాంతికి విడుదల చేయాలని అనుకుంటున్నారు.

ఆంధ్ర, నైజాం, సీడెడ్: పూర్ణా విడుదల; మైసూరు: సుధాచిత్ర.

కథ: స్క్రీన్ ప్లే: ప్రతాపరావు; మాటలు: వీటూరి; పాటలు: ఆరుద్ర, వీటూరి; సంగీతం: సత్యం; ఛాయ: దేవరాజ్; సహ దర్శకుడు: కత్తుల గోపాలకృష్ణ; ప్రొడక్షన్ మేనేజర్: వి. సుందరం; దర్శకుడు: కె. వి. యస్. కుటుంబరావు.

## చదువు లేని అన్న - చదువుకున్న చెల్లి

రామన్న రైతు బిడ్డ. చదువూ సంధ్యా లేకపోయినా నీతీ, నిజాయితీ—పట్టుదల, పౌరుషంగల యువకుడు. తను చదువుకో లేకపోయినా తన చెల్లెలయినా చదవాలని ఎవరెన్ని అన్నా, ఎన్ని అడ్డంకులు తెచ్చినా పట్నం పంపి పెద్ద చదువులు చదివించాడు.

ఆ చదువుల చెల్లెలు పట్నం నుంచి పల్లెలో యింటికి వచ్చింది.

"రావమ్మా రావమ్మా
రతనాల బొమ్మా
నీవల్లా మా యిల్లూ
వెలుగొందునమ్మా!",

అని పాడుతూ అందాల పల్లెపడుచులు ఆమెకు హారతులు పట్టి ఆహ్వానించి ముచ్చట్లు పోయారు తన చెల్లెలు చదువుల సరస్వతి అయి తన కోరికలు తీరి కలలు పండినందుకు రైతన్న రామన్న ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బయాడు. అన్నా చెల్లెళ్ళ అప్యాయతలూ, అనురాగాలు చూపి తల్లి పార్వతమ్మ మరింత మహదానందం పొందింది.

మానసోల్లాసమైన ఈ రసవత్తర సన్నివేశం రవీంద్ర ఆర్టు పిక్చర్స్ వారి పంచరంగుల చిత్రంలో ఓ హైలైట్.

సారధి స్టూడియోస్‌లో నవంబరు 15 నుండి వారంరోజులు జరిగిన షూటింగ్‌లో చక్కని పల్లెటూరి సెట్‌పై నాగేశ్వరరావు, వెన్నిరాడై నిర్మల, శాంతకుమారి మొదలగు వారిపై ఈ సన్నివేశాన్ని యువ దర్శకులు టి. లెనిన్‌బాబు చక్కగా చిత్రీకరించారు.

ఈ పై పాటను పి. నారాయణరెడ్డి



విజయవంతంగా నడుస్తున్న సత్య చిత్ర
'తాసిల్దారుగారి అమ్మాయి'లో శోభన్‌బాబు, చంద్రకళ

వ్రాయగా పి. సుశీల బృందం శ్రావ్యంగా పాడింది.

నాగభూషణం, రామకృష్ణ, సత్యనారాయణ, రావి కొండలరావు, బాలకృష్ణ మొదలగు వారిపై కొన్ని సన్నివేశాలను చిత్రీకరించారు.

తమ చిత్రానికి 'దత్త పుత్రుడు'గా పేరు పెట్టాలని మొదట్లో తలచినా ఇతివృత్తంలో ప్రధానమయిన మార్పులు రావడంవల్ల ఆ పేరును రద్దు చేశామనీ, చక్కని పేరును త్వరలో తెలియజేస్తామనీ నిర్మాత శ్రీ తమ్మారెడ్డి కృష్ణమూర్తిగారు తెల్పారు.

ఈ చిత్రం అవుట్‌డోర్ షూటింగ్ డిశంబరు మూడవ వారంలో జరిగింది

నాగేశ్వరరావు, వాణిశ్రీ హీరో-హీరోయిన్లుగా నటిస్తూన్న ఈ చిత్రంలో-ఇంకా అల్లు రామలింగయ్య, రమాప్రభ మొదలగు వారు నటిస్తున్నారు.

పినిశెట్టి రచన చేస్తున్న ఈ చిత్రానికి నారాయణరెడ్డి, కొసరాజు పాటలు వ్రాస్తున్నారు. టి. చలపతిరావు సరిగమలు కూర్చుతున్నారు. ఛాయ: ఎస్. వెంకటరత్నం, కళ: టి. వి. సుబ్బారావు, మేకప్: చౌదరి నిర్వహిస్తున్నారు.

నిర్మాత: తమ్మారెడ్డి కృష్ణమూర్తి.
దర్శకులు: టి. లెనిన్‌బాబు.
విడుదల లక్ష్మీ కంబైన్స్.

## జగత్ జంత్రీలు

'జగత్ కిలాడీలు', 'జగత్ జట్టీలు' వంటి సస్పెన్స్. క్రైమ్ థ్రిల్లర్స్ నిర్మించిన నిర్మాతలు శ్రీయుతులు పి. ఏకామ్రేశ్వరరావు, రాఘవగార్లు యీసారి తమ మూడవ చిత్రంగా మరో సస్పెన్స్ క్రైమ్ థ్రిల్లర్ ''జగత్ జంత్రీలు'' పేరిట అతి ప్రయాసలకోర్చి నిర్మిస్తున్నారు. ఈ చిత్రాన్ని సంక్రాంతి కానుకగా డిశంబర్ 30వ తేదీన విశాలాంధ్ర అంతటా విడుదల చేస్తున్నారు.

శోభన్‌బాబు, వాణిశ్రీ, ప్రభాకరరెడ్డి, రాజ్‌బాబు, రేణుక, పి. వెంకటేశ్వరరావు, విజయలలిత, జ్యోతిలక్ష్మి, నూతన నటుడు రాజా యీ చిత్రంలో ముఖ్య పాత్రల్లో కనుపిస్తారు.

ఈ చిత్రానికి కథ, మాటలు: దాశరధి, నారాయణరావు; పాటలు: కొసరాజు; సంగీతం: ఎస్. పి కోదండపాణి; దర్శకుడు: లక్ష్మీదీపక్.

ఆంధ్ర, సీడేడ్, నైజాం: లక్ష్మీ ఫిలింస్ ద్వారా విడుదలవుతూంది.

ప్రెస్ రిలేషన్స్ అండ్ పబ్లిసిటి: లక్ష్మీ ఎడ్వర్‌టైజర్స్.

## రాజమహల్ చిత్రం చిత్రీకరణ పూర్తయింది

హరికృష్ణా ఫిలిమ్స్ సంస్థ నిర్మాత శ్రీ బి. వి. కృష్ణమూర్తి నిర్మించిన "రాజమహల్" అనే క్రైమ్, మిష్టరీ, సస్పెన్స్ చిత్రం చిత్రీకరణ పూర్తయ్యింది. 'మెరుపు వీరుడు', 'పట్టుకుంటే లక్ష' చిత్రాలకు కూర్పు దర్శకుడుగా పరిచయమైన దర్శకులే ''రాజమహల్'' చిత్రానికి దర్శకులు.

కృష్ణ, కృష్ణంరాజు, విజయలలిత, జయకుమారి, జ్యోతిలక్ష్మి, కుమారి శ్రీదేవి, వసుంధర, రామదాసు, కె. వి. చలం, కె. కె. శర్మ పి. హెచ్. కృష్ణమూర్తి, గోకిన రామారావు, జి. ఎన్. స్వామి, డా॥ శివరామకృష్ణయ్య, పి, జె. శర్మ, పెమ్మసాని రామకృష్ణ మొదలైన వారు నటించిన యీ చిత్రాన్ని—ఆంధ్రా: రాజశ్రీ; సీడెడ్: గౌరీ పిక్చర్సు; నైజాం; శ్రీ శారదా ఫిలిమ్స్; మైసూర్: సుధా చిత్రల ద్వారా ఫిబ్రవరిలో విడుదల చేయనున్నారు.

కూర్పు, దర్శకత్వం: శ్రీ బి హరినారాయణ; సంగీతం: టి. వి. రాజు; మొదలైన టెక్నీషియన్సు నిర్వహించిన యీ చిత్రానికి కథ.



'శ్రీకృష్ణ సత్య'లో కాంతారావు, ఎన్. టి. రామారావు, పద్మనాభం, జయలలిత తదితరులు

---

స్క్రీన్ ప్లే, నిర్మాత: శ్రీ బి. వి. కృష్ణ మూర్తి (బి ఎ). ప్రెస్ పబ్లిసిటి: యస్. మనోహర్.

## భానూ మూవీస్ "కన్నతల్లి" షూటింగ్ పూర్తి

భానూ మూవీస్ వారు కొంగ్రొత్త రీతుల్లో నిర్మిస్తున్న చిత్రం "కన్నతల్లి" దాదాపు పూర్తయింది.

నిర్మాతలు యీ చిత్రంలో అందాల నూతన నర్తకి సరోజను మొదటిసారిగా ప్రేక్షకులకు పరిచయం చేస్తున్నారు.

తల్లీ, బిడ్డల మమత — ఈ చిత్రంలో అత్యద్భుతంగా చిత్రీకరింపబడినట్లు రషెస్ చూసిన వారంటున్నారు.

వాద ప్రతివాద ధురీణ, రాజకీయ చాణక్య, మధుర వాక్చతుర్య భూషణంగా నాగభూషణం; ప్రేమజంటగా శోభన్‌బాబు చంద్రకళ; హాస్య జంటగా రాజబాబు, సంధ్యారాణి; కొత్త తరహా విలన్‌గా పి. హెచ్. నారాయణరావు ఆద్యంతం అద్భుతంగా నటించిన యీ చిత్రంలో ఇంకా ప్రభాకరరెడ్డి, పెరుమాళ్ళు, రాధా కుమారి, పతకమూరి నాగభూషణం, మాష్టర్ విశ్వేశ్వరరావు, బేబీ సెల్వం, సహ తారాగణం

పతకిమూరి సుబ్బారాయుడు సమర్పిస్తున్న ఈ చిత్రానికి సాంకేతికవర్గం: మాటలు, పాటలు: ఆత్రేయ; సంగీతం: కె. వి మహదేవన్; కెమెరా: మునీర్ అహమద్.

నిర్మాణ నిర్వహణ: పతకమూరి నాగభూషణం; సహకార దర్శకులు: జి. రామమోహనరావు; నిర్మాతలు: డి వివేకానందరెడ్డి, రుద్రరాజు సీతారామ రాజు; దర్శకులు: టి. మాధవరావు; విడుదల: పూర్ణా.

## "బీదల పాట్లు"

శ్రీ విఠల్ ప్రొడక్షన్సువారు భారీయెత్తున ప్రముఖ తారాగణంతో నిర్మించిన "బీదల పాట్లు" చిత్ర నిర్మాణం పూర్తయింది. ప్రపంచ ప్రసిద్ధిగన్న ఈ ప్రముఖ గ్రంథాన్ని వెండితెరకెక్కించడంలో వ్యయప్రయాసలను లెక్కచేయకుండా పాత్రోచితగల పాత్రధారులను యెన్నుకోవడమే గాకుండా-సన్నివేశచిత్రీకరణకు అనువైన ప్రకృతీ దృశ్యాలతో కూడా చిత్రీకరించారు.

పద్మశ్రీ అక్కినేని నాగేశ్వరరావు, పద్మశ్రీ నాగయ్య, గుమ్మడి, సత్యనారాయణ, చంద్రమోహన్, చంద్రకళ, కృష్ణకుమారి, విజయలలిత, సూర్యకాంతం, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య సారధి, కాశీనాథ్ తాతా, ఏచూరి, వల్లం, సురేన్‌బాబు, బేబీ గౌరి, బేబీ దుర్గ, బేబీ మున్నీ ప్రభృతులు నటించిన ఈ చిత్రానికి - మాటలు: డి వి. నరసరాజు. పాటలు: సి. నారాయణరెడ్డి, కొసరాజు, జి. కె. మూర్తి. సంగీతం: కె. వి. మహాదేవన్. ఛాయ: ఎస్ వెంకటరత్నం. కళ జి వి. సుబ్బారావు. నృత్యం: శ్రీనివాస్. సహకార దర్శకులు: విజయా జగన్నాథ్. జి. విశ్వనాథం. సహ దర్శకులు: అంజిబాబు. ప్రెసెంటేషన్:గోటేటి నిర్మాత, దర్శకుడు: బి విఠలాచార్య.

-ఆంధ్ర ప్రదేశ్ అంతటా అన్నపూర్ణ ఫిలింస్‌ద్వారా విడుదలకానున్న మహత్తర చిత్రమిది.

## సవితా చిత్రా వారి "చిట్టితల్లి"

తల్లిలేని పసిపిల్ల రాణిని మచ్చిక చేసుకుని రాణితండ్రి జమీందార్ ఆనంద బాబును వలలో వేసుకుందుకు ప్రయత్నిస్తూందని కమలపై "అపవాదు" లేవదీసింది సంఘం. ఆ వార్త కమల టీచరుగా పనిచేస్తున్న పాఠశాల ప్రధానోపాధ్యాయిని చెవివరకూ ప్రాకింది. ఆమె వెంటనే కమలకికబురుచేసి "చూడమ్మా! ఈ స్కూల్ ఆనంద్ బాబు నాన్నగారు స్థాపించారు- వారి డబ్బుతోనే ఇది నడుస్తోంది, నువ్విక్కడ ఉద్యోగం చేస్తుండడం మూలంగా ఈ స్కూలు మూసివేసే పరిస్థితి వచ్చింది" అంది.



పి. ఏ. పి. వారి 'భార్యా బిడ్డలు' లో
జయలలిత, నాగేశ్వరరావు.

"అంతే"- కమల ఆశ్చర్యంగా చూసింది- "నాకేం అర్థం కావడంలేదు"

"ఏ వ్యక్తి ఉంటే ఆనంద బాబుగారు గ్రాంట్ ఇవ్వనన్నారు."

"నా నుంచి స్కూల్ మూసెయ్యడం ఎందుకు? నేనే మానేస్తాను"

"సో సారీ కమలా!"

"ఇటీస్ మై బేడ్ లక్" అంది కమల బాధతో బరువెక్కిన గుండె చిక్కబట్టుకుని- విద్యా, వినయం, వివేకం. వీటికి తోడు మంచి హృదయం. సత్శీలం గల "స్త్రీ" అసహాయురాలైతే సమాజంలో అడుగడుగునా భయంకర సంఘటనలు త్రొక్కుతుంటూ తనమీద ఆధారపడ్డ తండ్రిని పోషిస్తూ బరువు, బాధ్యతల్ని సవ్యంగా. సక్రమంగా నిర్వర్తించే ఉదాత్తమైన కమల పాత్రను సవిత చిత్రవారి "చిట్టి తల్లి"లో భారతి అత్యంత ప్రతిభావంతంగా పోషిస్తూంది చిన్నారి "చిట్టి తల్లి"గా చిరంజీవి బేబీ రాణి ముద్దుపలుకులతో ముచ్చటగా నటిస్తూంది. వారితో పాటు హరనాథ్. కె. వి. నాగేశ్వరరావ్, రాజ్‌బాబు, రమాప్రభ, జయకుమారి. ఉష, ఛాయాదేవి, పెరుమాళ్లు, నల్ల రామమూర్తి, సాక్షి రంగారావు ప్రభృతి నటీ నటవరం పాల్గొంటుంది.

శ్రీ కె. ఎ. శాస్త్రి, జి. కె, మూర్తి సంయుక్తంగా నిర్మిస్తున్న "చిట్టితల్లి" చిత్రానికి పాటలు: డా॥ సి నారాయణ రెడ్డి, జి. కె. మూర్తి. సంగీతం: విజయా కృష్ణమూర్తి, ఛాయ: సి జె మోహన్ రామ్. నిర్మాణ నిర్వహణ: శేఖర్.

రచన, దర్శకత్వం: జి. కె. మూర్తి బి. ఏ. అతిశీఘ్రంలో విడుదల కానున్న ఈ చిత్రానికి పంపిణీదార్లు:—

శ్రీ కుమారస్వామి పిక్చర్ (ఆంధ్ర.) శ్రీ బలరామ్ పిక్చర్స్ (సీడెడ్) శ్రీపద్మా ఫిలిమ్స్ (నైజామ్).

## మోసగాళ్ళకు మోసగాడు శతదినోత్సవ వేడుకలు

హీరో కృష్ణ సమర్పించిన శ్రీ పద్మాలయా మూవీస్‌వారి ఈస్టుమన్ కలర్ చిత్రం "మోసగాళ్ళకు—మోసగాడు" శతదినోత్సవ వేడుకలు డిశెంబరు నాలుగవ తేదీన మద్రాసులోని హోటల్ అశోకాలో జరిగాయి.

సాయంకాలం ఆరుగంటలకు అల్పాహారవిందు జరిగినఅనంతరం శ్రీ ఘంటసాల ప్రార్థనగీతంతో సభ ఆరంభమైంది.

ప్రసిద్ధ దర్శకుడు శ్రీ ఆదుర్తి సుబ్బారావు అధ్యక్షత వహించిన ఈ సభకు పద్మశ్రీ శ్రీమతి భానుమతీ రామకృష్ణ ముఖ్య అతిధిగా విచ్చేశారు.

మోసగాళ్ళకు మోసగాడు చిత్రంలో పాల్గొన్న నటీనటులకు ప్రముఖ నిర్మాత శ్రీ డూండీ- శ్రీ పద్మాలయా మూవీస్ తరపున షీల్డులను బంగారు ఉంగరాలను బహూకరించారు.

ఈ ఉత్సవానికి దాదాపు వెయ్యిమందికి పైగా హాజరయ్యారు. చలన చిత్ర పరిశ్రమకు సంబంధించిన అనేకమంది దర్శకులు, నిర్మాతలు, పత్రికా రచయితలతో పాటు- శోభన్‌బాబు, జగ్గయ్య, కృష్ణంరాజు, అంజలీదేవి, సావిత్రి, జమున, గీతాంజలి, కాంచన మొదలైన తారలూ వచ్చి సభను జయప్రదం చేశారు.

ఈ ఉత్సవంలో అధ్యక్షులు శ్రీ ఆదుర్తి మాట్లాడుతూ "కృష్ణ నావాడు" అని చెప్పుకోవడానికి నాకు అర్హత వుంది. అయిన యీ చిత్రం ఇంతటి

---

జాతీయ రక్షణ నిధికి ఉదారంగా విరాళాలు ఇవ్వండి• మీ విరాళాలను ముఖ్య మంత్రికి కానీ, ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి కాని, జిల్లా కలక్టర్లకు కాని పంపండి.

అనుమతిలేని వ్యక్తులకు సంస్థలకు విరాళాలు యివ్వకూడదు.



రవి శంకర్ ప్రొడక్షన్స్ నెం:1 చిత్ర ప్రారంభోత్సవ సందర్భంలో నటి జమున, శ్రీమతి అనసూయ వేణుగోపాల్

---

ఉన్నత సాంకేతిక విలువతో, ఒక హాలీవుడ్ చిత్రంలా నిర్మించటం గర్వించదగిన విషయం'' అన్నారు.

ముఖ్య అతిథి శ్రీమతి పద్మశ్రీ భానుమతి రామకృష్ణ ప్రసంగిస్తూ "ఈ చిత్రం ఇంత విశేష ప్రజాదరణ పొంది నూరు రోజుల పండుగ జరుపుకోవటం తనకు సంతోషాన్ని కలిగిస్తున్నదని 'కృష్ణ' ఇటువంటి చిత్రాన్ని నిర్మించినందుకు అభినందిస్తున్నాననీ'' అన్నారు

''కృత్రిమత్వం ఎక్కువగా కనిపిస్తుంది పరిశ్రమలో ఉండే మనుషుల్లో కృత్రిమత్వం లేకుండా, సహజంగా, నిరాడంబరంగా మాట్లాడుతారు కృష్ణ. అది ఆయన మంచితనం ఈ చిత్ర విజయానికిగల కారణాలలో మంచితనంకూడా ఒక కారణం'' అనికూడా భానుమతిరామకృష్ణ తమ ప్రసంగంలో చెప్పారు

తరువాత కవులు దాశరథి, ఆరుద్ర, నటులు నాగభూషణం, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, ప్రభృతులు మాట్లాడారు.

శ్రీ పద్మాలయా మూవీస్‌వారు తమ చిత్రంలోపాల్గొన్న నటీనటులకు, పంపిణీదారులకు, ఎగ్జిబిటర్స్‌కీ, యాభై షీల్డులను, నలభై బంగారం ఉంగరాలను బహూకరించారు. విజయవాడ శేష్‌మహల్‌వారు,

శ్రీఫిలింస్‌వారు. న్యూ ఇండియా ఫిలిమ్స్ వారు - బెంగుళూరు డిస్ట్రిబ్యూటర్స్ - నిర్మాతకు షీల్డులను ఇచ్చారు.

న్యూ ఇండియా ఫిలిమ్స్‌కి చెందిన శ్రీ నాజమ్—పద్మాలయా మూవీస్ బృందానికి ఇరవై ఐదు బంగారు ఉంగరాలను ప్రత్యేకంగా చేయించి యిచ్చారు.

పబ్లిసిటీ నిర్వాహకులు నిమ్మగడ్డ వెంకటకృష్ణారావు అండ్ సన్సు (ఎన్. వి కె ఆర్.) వారిచే ప్రత్యేకంగా చేయించబడిన 'రజత పోస్టర్' పటాలు ప్రేక్షను బహూకరించబడినవి.

న్యూ ఇండియా ఫిలిమ్స్‌కి చెందిన శ్రీ జి. ఆర్. శేషగిరిరావు, విజయవాడ శేష్ మహల్ థియేటర్ సిబ్బందికి ఒక నెల జీతం బోనస్‌గా యిస్తున్నట్లు ప్రకటించారు. వందన సమర్పణకు ముందు కృష్ణ మాట్లాడుతూ యీ నాడు తాను చలనచిత్ర పరిశ్రమలో ఉండటానికి ఇంత అభివృద్ధిని సాధించటానికి కారకులైన శ్రీ ఆదుర్తి సుబ్బారావు, శ్రీ డూండీలకు-తను నిర్మాతగా నిలబడటానికీ, తన చిత్రాలు విజయవంతంగా ప్రదర్శించడానికి కారకులైన శ్రీఫిలింస్ పంపిణీ సంస్థవారికి కృతజ్ఞతలు తెలిపారు.

## రవిశంకర్ పిక్చర్స్ ప్రొడక్షన్ నెం. 1

రవిశంకర్ పిక్చర్స్ ప్రొడక్షన్ నెం.1. డిశంబరు 2 వ తేదీ ఉదయం 8 గంటలకు ప్రసాద్ స్టూడియోలో పూజ జరిగింది. తొలిషాట్ జమునమీద చిత్రీకరించగా శ్రీమతి అనసూయా వేణుగోపాల్ క్లాప్ కొట్టారు. నవయుగ అధినేత శ్రీ కె. శ్రీనివాసరావు ఎం. పి. కెమెరా స్విచ్ ఆన్ చేశారు. 2 వ తేదీ నుండి 11 వ తేదీ వరకు జరిగిన యీ షెడ్యూలులో సుమారు 5 రీళ్ళ చిత్రం తయారయింది. ఇంకా గుమ్మడి సూర్యకాంతం రాజబాబు. కె వి చలం. రేణుక, నల్ల

"వేలాది సంవత్సరాల పురాతన సంస్కృతి. సంప్రదాయాలు మనవి. సత్యము, ధర్మము పట్ల మనకు అచంచలమైన విశ్వాసం వుంది. ప్రపంచంలో ఏ దేశం కూడా అది సైనికంగా ఆర్థికంగా ఎంత బలవంతమైన దైనప్పటికి భారత దేశాన్ని అది విశ్వసించిన లక్ష్యాల నుంచి మళ్ళించ లేదు."

శ్రీమతి ఇందిరా గాంధి

ప్రధాన మంత్రి



శ్రీ విఠల్ ప్రొడక్షన్సు అండ్ కో వారి 'బీదల పాట్లు'లో
నాగేశ్వరరావు, గుమ్మడి

రామమూర్తి. రావు గోపాలరావు. అశోక్ కుమార్. సి. హెచ్. కృష్ణమూర్తి. బేబీ శ్రీదేవి. మాస్టర్ గాంధీ. మాస్టర్ విశ్వేశ్వరరావు నటిస్తున్న ఈ చిత్రంలో గెస్టుగా సత్యనారాయణ నటిస్తున్నారు శ్రీమతి మాదిరెడ్డి సులోచన 'శిక్ష' ఆధారంగా నిర్మించబడుచున్న యీ చిత్రానికి దర్శకులు: బి. ఎస్. నారాయణ నిర్మాత: వై. సుశీల్‌చౌదరి సోల్ డిస్ట్రిబ్యూటర్లు: ఆల్ ప్రభాస్ ఎంటర్‌ప్రైసెస్, నవయుగ విడుదల.

## "శభాష్ బుల్లెమ్మ"

అనేక తెలుగు. కన్నడ చిత్రాలను లోగడ నిర్మించి పరిశ్రమలోని అనుభవాన్ని ఆకళింపు చేసుకున్న ప్రొడ్యూసర్ దోనేపూడి కృష్ణమూర్తి నేటి ప్రేక్షకుల అభిరుచిని గుర్తించి శ్రీ రామగోపాల్ బేనర్‌పై "శభాష్ బుల్లెమ్మ" పేరుతో ఒకచక్కని సస్పెన్సు. క్రైమ్ థ్రిల్లర్‌ను సమర్పిస్తున్నారు.

నవంబరు 23 వ తేదీని మద్రాసు



నవభారత్ మూవీస్ 'రైతు కుటుంబం'లో
కాంచన, నాగేశ్వరరావు

ప్రముఖ ఛాయాగ్రాహకులు రవికాంత్ నగాయిచ్ ట్రిక్ ఫోటోగ్రఫీ కొత్త పోకడలతో సంభ్రమాశ్చర్యాలను కలిగించ బోతున్నది

తారాగణం: ఎస్. వి. రంగారావు, శోభన్‌బాబు, గుమ్మడి, నాగయ్య, సత్యనారాయణ, చంద్రమోహన్, నాగరాజు, తంబి, పి. రామకృష్ణ, అర్జా జనార్ధనరావు, చిక్కాలిసేవి మాధవపెద్ది, ముక్కామల, ఝాన్సీపాల, జగ్గారావు, చంద్రకళ, జమున, హేమలత, కృష్ణకుమారి, శ్రీరంజని, ఋష్యేంద్రమణి, ఛాయాదేవి, లీలారాణి, మొదలగువారు.

సాంకేతికవర్గం: రచన: ఆరుద్ర, ముళ్ళపూడి వెంకటరమణ; పాటలు పద్యాలు: సి. నారాయణరెడ్డి, ఆరుద్ర, దాశరథి, కొసరాజు, గబ్బిట వెంకటరావు; సంగీతం: కె. వి. మహాదేవన్, ఫోటోగ్రఫీ: కె. ఎస్. ప్రసాద్, ట్రిక్ ఫోటోగ్రఫీ: రవికాంత్ నగాయిచ్, నృత్యాలు: వెంపటి(?) పసుమర్తి కృష్ణమూర్తి, కళ: ఎ. కె. శేఖర్, కూర్పు: ఎ. సంజీవి, రూపాలంకరణ: వాలి, వస్త్రాలంకరణ: నారాయణమూర్తి, మేకప్: రమేష్ నాయుడు.

ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్: శంబి, సహకార దర్శకులు: కె. వి. రావు, సి. యస్. బోస్, నిర్మాత: నిడమర్తి పద్మాక్షి, దర్శకుడు: బాపు. విడుదల: లక్ష్మీ ఫిలింస్.

వీనస్ స్టుడియోలో అతి నిరాడంబరంగా శాస్త్రయుక్తంగా జరిగిన పూజా కార్యక్రమానికి పరిశ్రమకు చెందిన పలువురు శ్రేయోభిలాషులు విచ్చేసి విజయానికి శుభాకాంక్షల నందజేశారు. దర్శకులు విజయ్ మొదటిషాట్ నే విజయవంతంగా చిత్రీకరించారు. తదుపరి వరుసగా నాలుగు రోజులు జరిగిన మొదటి షెడ్యూల్ షూటింగ్స్‌లో దాదాపు చిత్రంలోని నటీనటులందరూ పాల్గొన్నారు.

విజయలలిత. రామకృష్ణ. విజయశ్రీ. సత్యనారాయణ. త్యాగరాజు. ప్రభాకరరెడ్డి రామదాసు పొట్టిప్రసాద్. సంధ్యారాణి వగైరా తారాగణం గల ఈ చిత్రానికి వీటూరి రచన. సత్యం సంగీతం. ప్రకాష్ ఛాయాగ్రహణం కె. నాగేశ్వరరావు కళా దర్శకత్వం భక్తవత్సలం కూర్పు నిర్వ నిర్వహిస్తున్నారు. ప్రొడ్యూసర్: దోనేపూడి కృష్ణమూర్తి. దర్శకత్వం: విజయ్.

## "సంపూర్ణ రామాయణము"

లక్ష్మి ఎంటర్ ప్రయిజస్‌వారు ఈస్ట్ మన్ కలర్‌లో అపూర్వ దృశ్య కావ్యంగా నిర్మిస్తున్న "సంపూర్ణ రామాయణము" చిత్రం దాదాపు 1i రీళ్ళయింది

ప్రసాద్, ఏ. వి. యం. స్టూడియోస్లో అత్యధిక ధనవ్యయంతో భారీఎత్తున నిర్మించిన కళాన్వితమైన సెట్స్‌పై ప్రధాన తారాగణంతో, వందలాది జూనియర్ నటీనటులతో నవంబరు 20నుండి 30వరకు నిర్విరామంగా షూటింగ్ జరిగింది. పసిబాలుడు శ్రీరామచంద్రుడు బువ్వ తింటూ — పండు వెన్నెల నిండు చందమామను తెచ్చివ్వమని పేచీ పెట్టిన సన్నివేశంలో చిన్న రామునిగా బేబీ మున్నీ. కైకేయిగా జమున దశరథునిగా గుమ్మడి కౌసల్యా, సుమిత్రలుగా హేమలత. శ్రీరంజని పాల్గొనగా చిత్రీకరించారు.

తండ్రి ఆజ్ఞానుసారంపైన రాముడు సీతా లక్ష్మణ సమేతుడై వనవాసమునకు వెళ్తున్న సందర్భంగా—

"వెడలెను కోదండపాణి
అడవులకు మునివెంబడి"

నేపథ్య పాటను శోభన్‌బాబు, చంద్రకళ, నాగరాజు, వందలాది జూనియర్ నటీనటులపై —అత్యద్భుతంగా నిర్మించిన అయోధ్య నగరరాజ ప్రాసాద ప్రాంగణంలో, పుర వీధులలో అపూర్వంగా చిత్రీకరించారు. సుశీల, పి. బి. శ్రీనివాస్ పాడిన కోరస్ పాట ఈ చిత్రంలో మరో హైలైట్‌గా భాసిస్తున్నారు.

ఉద్యానవనంలో సీత (చంద్రకళ) బంతి ఆడుట రాముని పట్టాభిషేకమునకై అయోధ్య అలంకరణ, మందర (ఛాయాదేవి) అసూయ, మామగారింటి నుండి వచ్చిన భరత, శత్రుఘ్నులు (చంద్రమోహన్, తంబి) కళావిహీనమైన అయోధ్యను, అంతఃపురాన్ని చూసి విభ్రాంతులవడం, వశిష్టుని (నాగయ్య) వద్ద విలువిద్యా శిక్షణ, రాముడు రాక్షసులను చంపడం వానర సేనతో లంకలో మోహరింపు, యుద్ధాసన్నాహాలు- మొదలగు సన్నివేశాలు చిత్రీకరణ జరిగింది



'అమ్మ మాట'లో లీలారాణి

---

## శరవేగంతో నిర్మితమవుతున్న "భలే మోసగాడు"

శ్రీ పి. వి. కె. దుర్గాప్రసాద్‌రావు సమర్పిస్తున్న పద్మలక్ష్మి పిక్చర్స్ వారి చిత్రం "భలే మోసగాడు" శరవేగంతో నిర్మితమవుతోంది. ఇప్పటికి దాదాపు 10 రీళ్ళయింది.

ఇటీవల జరిగిన అవుట్‌డోర్ షూటింగులో చెంగల్పట్టు చిట్టడవుల్లో భయంకర ఫైటింగ్స్, ఆకాశంలో విమానం పేలి దగ్ధమై పోయిన అపూర్వ దృశ్యం, మోటారుసైకిల్, కారు, జీపులపై కొత్త తరహా ఛేజింగ్ సన్నివేశాలను సంభ్రమాశ్చర్యాలు గొల్పేలా అద్భుతంగా చిత్రీకరించాడు

భారీ ఎత్తున నిర్మించిన హీరో హౌస్ సెట్, నర్తకి జయకుమారి బాత్‌రూమ్ సెట్ - ఈ చిత్రంలో మరో రెండు ప్రత్యేకతలు.

నిర్విరామంగా జరిగిన యీ షెడ్యూలు షూటింగ్‌లో హీరో కృష్ణ హీరోయిన్ విజయనిర్మల, విలన్ త్యాగరాజ్ - ఇంకా కృష్ణంరాజు, జగ్గారావు, సి. హెచ్. నారాయణరావు, లీలారాణి, పెమ్మసాని రామకృష్ణ, అర్జా జనార్ధనరావు, జి. వి. రామచంద్రరావు, శ్రీవాణి, అప్పారావు మొదలగు వారు పాల్గొన్నారు.

ప్రముఖ నర్తకి జ్యోతిలక్ష్మి, నటుడు కె. వి. చలం యీ చిత్రంలో ప్రత్యేక ఆకర్షణలు.

కని-విని ఎరుగని అత్యద్భుత భయంకర సన్నివేశాలు, పటువైన సస్పెన్స్; ఆద్యంతం ఆసక్తిని కలిగించే కథా గమనం గల యీ చిత్రాన్ని అతిత్వరలో విడుదల చేయాలని సన్నాహాలు చేస్తున్నారు.

కృష్ణ, విజయనిర్మల, త్యాగరాజు, కృష్ణంరాజు, జగ్గారావు, సి. హెచ్. నారాయణరావు, కె. వి. చలం, పెమ్మసాని రామకృష్ణ, అర్జా జనార్ధనరావు, జి. వి. రామచంద్రరావు, జ్యోతిలక్ష్మి, జయకుమారి, లీలారాణి, పి. వరలక్ష్మి మొదలగువారు నటవర్గం.

కథ, మాటలు: విశ్వప్రసాద్; పాటలు: దాశరధి, కొసరాజు; సంగీతం: సత్యం; నిర్వహణ: పి. శ్రీనివాసరావు; సమర్పణ: పి. వి. కె. దుర్గాప్రసాదరావు; నిర్మాత: గబ్బిట వెంకటరావు; దర్శకులు: పి. సాంబశివరావు.

జ్యోతి

JYOTI - JANUARY - 72
REGD No. M 8669

శ్రీవెంకటేశ్వర ఆర్ట్ ఫిలింస్ సమర్పించు గిరిఫిలింస్

# మేరీ మాత

ఈస్ట్‌మన్ కలర్

మాటలు పాటలు రాజశ్రీ. సంగీతం జి.దేవరాజన్
స్క్రీన్‌ప్లే-దర్శకత్వం నిర్మాత దర్శకుడు కె. తంగప్పన్

ఆంధ్ర
సోల్ డిస్ట్రిబ్యూటర్సు
లక్ష్మీ కంబైన్సు

ఆంధ్ర లక్ష్మీ ఫి
సీడెడ్ నవభా
నైజాం. శ్రీతా



LAKSHMI

STUDI